బోజ - కథలు

**రంగులు**

మొదటి ముద్రణ : 1994

ముఖచిత్రం : శ్రీను

ప్రచురణ : సాహితిమిత్రులు,
నల్లగొండ

సర్వహక్కులు : రచయితవి

ప్రతులకు :

బి. చేతన్

ప్రగతి పబ్లిషింగ్ హౌజ్

5-9-214

మాన్యం చెలక

నల్లగొండ 508 001

ఫోన్ నెం.32515

మరియు

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్

(అన్ని బ్రాంచీలలోను)

**వెల : సాదా ప్రతి 20/-**

**మేలుప్రతి 30/-**

అప్పుడప్పుడు నన్ను నవ్విస్తూ....

ఎప్పుడు కథో, కవితో రాయమనే....

మిత్రులు దేవులపల్లి కృష్ణ మూర్తికి....

- బోజ

# ఇందులో

గతంలో మేం ప్రచురించిన కథలు, నవల, కవితలు, సమీక్షల ద్వారా పత్రికల మెప్పును, ప్రతుల అమ్మకం ద్వారా పాఠకుల ఆదరణనూ పొందాయి

కథలు నాగార్జున విశ్వవిద్యాలయపు బంగారు పతకాన్ని, నవల తెలుగు విశ్వవిద్యాలయపు ఉత్తమ నవల అవార్డును గెలుచుకున్నాయి అని తెలుపుటకు సంతోషిస్తున్నాము.

ఈ 'రంగులు' కథలు మీకు మంచిగా అనిపిస్తే మరొకరికి చెప్పండి లేదా మాకే తెలియపరచండి

ఆలోచనమాది – ఆదరణమీది.

సాహితీమిత్రులు, నల్లగొండ.

- ఇందులోని కథలను క్రితంలో ప్రచురించిన వివిధ పత్రికా సంపాదకులకు
- అన్ని రకాల సహాయపడ్డ మేరెడ్డి యాదగిరిరెడ్డి, బెంజమెన్ కృపయ్య, సీను, గార్లకు
- ముఖపత్రం గీసిన రామచంద్రంగారికి
- ప్రచురణ బాధ్యత వహించిన దేవులపల్లి కాతోజు వెంకటేశ్వర్ల గారికి
- ప్రచురించిన సాహితీ మిత్రులకు నా కృతజ్ఞతలు

బోయ జంగయ్య
చేతన కాటేజ్
నల్లగొండ, 508 001.
ఫోన్ : 32515

# మరుగుమందు

తెల్లారకముందే దుర్గమ్మ కుంపటి ముందు కూర్చొని అందులో ఎండుపుల్లలు వేస్తూ మంటలను లేపుతూ ఉంది. భార్య మంట పెట్టేది చూసి వెంకయ్యా లేచొచ్చి కుంపటి ముందు కూర్చొని చుట్టను వెలిగించాడు.

"నీ వేపీ పట్టించుకోవు, చెట్టంత కొడుకు చేతినుండి పోయినంక దినాలు చేసి దేశాల పొంటి పోదాం" అన్నది.

"మన గీత సక్కగలేదు", అంటు తలకొట్టుకొన్నాడు.

"మనుసులు సేసిన పనికి గీతలెందుకు అనుకోవాలె!"

దుర్గమ్మ పుల్లలను ఎగదోసి మంటను కాస్తా పెద్దగ చేస్తూ అంది.

వెంకయ్య ఆలోచనలో పడ్డాడు.

"సర్పంచ్‌కి సెప్పొచ్చిన, తల్లి తండ్రికి సెప్పంపిన,"

"వాళ్లు వొస్తున్నారె గట్టిగ సెప్పు అది మాకొద్దు అని" మళ్లీ తానే అంది.

జగిట్లోని మంచంమీద రాములు గునిసినట్లు శబ్దం రాగానే వెంకయ్య చుట్టను ఆర్పి, పక్కన పెట్టి, లోపలికి వెళ్లి కొడుకు పడుకొని ఉన్న మంచపు పట్టెపై కూర్చొని వొంటిమీద చెయ్యేసి చూసి, వాకిట్లో ఏడుస్తున్న కుక్కను అదిలించడానికి బయటికి నడిచాడు.

రాములు ఇంటి వాసాలవైపు చూస్తూ, తన కొచ్చిన రోగాన్ని గూర్చి ఆలోచిస్తూ "బతికి బట్ట గడతానో, లేకపోతే యింతటితో..." అన్న తలంపు రాగానే కనుకొలుకులు తడి అయినవి. ఆ ఆపత్తి కాలంలో తన భార్యను తన దగ్గర ఉండకుండా చేసిన తల్లిని ఏమనాలో అర్థం కాక అసహనంగ పార్లి పక్క మీద పడుకొని భార్యను గుర్తు తెచ్చుకున్నాడు.

పొద్దు బారెడెక్కింది. పిల్లబాటున నడుస్తున్న రాములు, ఆయన వెనకాల అతని భార్య ఊరుదాటి చెలకల్ల

నుండి నడుస్తున్నప్పుడు బాటకిరుప్రక్కల పచ్చగడ్డిమీద, చెట్ల ఆకుల మీద రాత్రి కుర్సిన మంచు బిందువులు మెరుస్తున్నవి. పిట్టలు లేత ఎండలో రెక్కల్ని ఆడారేసు కొంటున్నవి. ఎరుపు, పసుపు, నీలం రంగు గడ్డి పూలపై సీతాకోకచిలుకలు ఎగురుతున్నవి. అక్కడక్కడ నిలువెల్లా పూసిన మోదుగులు. ఇద్దరూ ఏదేదో మాట్లాడు కుంటూ, మధ్యమధ్యన నవ్వుకుంటూ సరిగ్గా అంబటాల్లకు ఇల్లుచేరారు.

రెండుగదులు, ఓ జగిలి ఉన్న తాటాకుల పూరిల్లు వాళ్లది.

మల్లమ్మది పుష్టి అయిన శరీరం, తెల్లని పలువరుస, చురుకైన చూపులు, గడ్డముకింద ఉన్న చిన్నిగుంట, అందంగా చెక్కిన నల్లరాయి శిల్పంలా ఉంది. తలకు వొత్తుగ అంటిన నూనె మెరుస్తున్నది. ముఖానికి పైసంత బొట్టు, కొప్పులో తంగెడిపూలు, చేతిలో బట్టలున్న సంచితో జాలారిలోకి వెళ్లి కాళ్లు, చేతులు కడుక్కొని ఇంట్లోకి నడిచింది.

రాములు పెళ్లి అయినప్పటినుండి భార్యను బాగానే చూసుకుంటున్నాడు. రోజంతా వ్యవసాయ పనులకు వెళ్లడం, ముదుసలి వాళ్లు అయినా తల్లి, తండ్రి ఏదో పని

చేస్తూనే ఉండడం, తిండి, బట్టకు ఇబ్బంది లేకుండా ఉన్నంతలో సంసారాన్ని నడుపుకుంటున్నారు. కానీ రాములు తల్లి దుర్గమ్మ ఆ యింట్లో జోరీగ.

వారం రోజుల కింద తల్లిగారి ఇంటికి పోయిన భార్యను తీసుకురావడానికి వెళ్లిన కొడుకు, అత్తగారి ఇంటి దగ్గర రెండు రోజులుండి ంావడం దుర్గమ్మకు ఇష్టంలేదు. అసలు ఆమెది అదోతత్వం. తన అత్త తనను కట్టుబాటుల్లో పెట్టినట్లే తన కోడలును తాను కట్టుబాటుల్లో ఉంచాలన్న బలమైన కోరిక ఆమెది. ఆ కోరికే అవస్థలను సృష్టిస్తున్న సంగతి ఆమె ఎందువల్లనో గ్రహించదు. మారుతున్న కాలం విషయమూ ఆమె పట్టించుకోదు.

ఊరునుండి వచ్చిన కొడుకు, కోడలును చూసి మూతిని అటు ఇటు తిప్పుకుంటూ ముక్కుమీద వేలేసుకొని–

"ఇంకో రెండు రోజులుండి రాకపోయినవ్?"

రాములు చప్పుడు చెయ్యలేదు.

"మీ పూట గడిస్తే చాలు మేం ఎట్ల సస్తే ఏంది?" అన్నది మళ్లీ తానే.

"సూడే అమ్మ గింత దానికి, గంతదానికి సావులు –

బతుకులు ఎంచకు. సచ్చేనాడు ఎవ్వరు ఎవ్వర్ని ఆపరు".

కొడుకు తనకు జవాబు యిచ్చినందుకు దుర్గమ్మకు రోషం తన్నుకొచ్చింది.

"సచ్చేనాడు ఆపకుంటే మానె, బతికేటోల్లను సంపొద్దుర" అన్న తల్లితో ఎక్కువ మాట్లాడడం ఇష్టంలేక, బయటికి నడిచాడు.

దుర్గమ్మ తనలో తాను గొణుగుతూ నిలుచుంది.

కోడలు కొడుకును కొంగున కట్టేసుకుందని ఆమెకు కోపం. అదే కోపాన్ని ఆమె అప్పుడప్పుడు మాటల్లో, చూపుల్లో చూపిస్తూ ఉంటుంది. అంతేకాదు తనకు అనుమానం వచ్చినప్పుడల్లా "ఏమోనయ్యా! ఈ పిల్లను తెచ్చి వానికి సేస్తిమి, దీన్ని సూస్తుంటే ఎప్పుడు ఏం సెడు జరుగుద్దో అని భయంగ ఉంది" అని మొగనితో అంటూ ఉంటుంది దుర్గమ్మ.

"దాని తల్లి ఓమాయలాడి, దీనివి అన్నీ తల్లి బుద్దులే, నా తోడపుట్టినోనికి ఓ బిడ్డ ఉంటే, ఆ మేనదాన్ని సేసుకుందును. ఈనాటి దాంతో నానాపాట్లు" అని కూడా అంటూ ఉంటుంది.

మల్లమ్మ నీళ్లకు వెళ్లినప్పుడు, కూలి గింజల కెళ్లినప్పుడు, ఊళ్లో గంగిరెద్దులను ఆడిస్తున్నప్పుడు,

గారడీవాడు మాయలు చూపిస్తున్నప్పుడు కోడలిని ఓ కంట కనిపెడుతూ, ఎక్కడైనా ఎవరితో నన్న నవ్వినా, మాట్లాడినా వెంటనే మందలిస్తూ ఉంటుంది. తన కొడుకు కూడా ఎప్పుడూ పెళ్లాన్నే అంటిపెట్టుకొని ఉండడం ఇష్టపడక "అస్తమాసం ఆడదాన్నే సూసుకుంటు ఉంటే మతి సెడుతది" అని అంటూ ఉంటుంది.

దుర్గమ్మ కాపురానికి వచ్చిన కొత్తలో తన మొగుడు తననే చూస్తూ ఉంటే తన అత్త "ఏందది ఊరపిచ్చుక చేష్టలు? దీపాన్ని ఆర్పేసి రాత్రి పక్కమీద తప్ప తెల్లారితే ఎవరి పనిమీద వాళ్లుండాలి." అని అనేదట. అత్త చెప్పినట్లుగా మసలుకున్న దుర్గమ్మ ఓ బిడ్డ, కొడుకును కనుకొని వాళ్లు పెళ్లీడు కొచ్చినంక గాని మొగుని ఎదురుగ నిలుచోని మాట్లాడలేదట.

కానీ తన కోడలు తనలాగ కాకుండ అందుకు భిన్నంగా ఉంది. అదో మాదిరిగ సింగారించుకోవడం, చిన్నా, పెద్దా లేకుండా మాట్లాడడం, సిగ్గు విడచి పరాయి మొుగోళ్లతో వరాచికాలాడడం, అనర్థాలను తెచ్చిపెడతాయని ఆమె నమ్మకం. శార్థకాళ్లు చెప్పిన పురాణ కతలు, తోలుబొమ్మల ఆటలు ఆమెలో ఆ నమ్మకాన్ని పెంచినవి.

హద్దుదాటటం వల్ల సీతమ్మకు చెరలొచ్చినవి, నవ్వే నందుకే ద్రౌపది బట్టలు యిడిపించిండ్రని, ఆడదాని సక్కదనం ఆడదానికి చెడు చెయ్యడం అటుంచి, అది సంసారం చేసే వంశానికే చేటును తెస్తదని తన ఒక్క కొడుకుకు ఎప్పుడు ఏ కీడు తెచ్చిపెడుతుందో నని ఆమె భయం.

ఒక రోజు వరి నాట్లకు ఊళ్లోకి వొస్తున్న చాలమంది ఆడవాళ్లలో తాను, తన కోడలు ఉన్నారు.

ప్రొద్దుకూకే సమయం, సూర్యుడు రంగు మారుతున్న వేళ. అంతకంటే ముందు కుర్సిన తెప్ప చినుకులకు తడిసిన వొళ్లను, వొంటిమీది గుడ్డలను, వొంటి వొంపు సొంపుల అందాలను ఆ నీరెండలో ఆరేసుకుంటూ, సరదాగ ఆ మాట ఈ మాట చెప్పుకుంటూ మధ్య మధ్యన నవ్వులను వొలకపోస్తూ పడుచువాళ్లు నడుస్తూ ఉంటే, వయస్సు దాటిన స్త్రీలు కొంగును వొంటినిండా కప్పుకొని దాని చాటున చేతులు ముడుచుకొని నడుస్తున్నారు.

దుర్గమ్మ ఉన్నట్టుండి వెనక్కు చూసింది. అంతే వొళ్లంతా వణికిపోయింది. ఎవరో ఒకతను సైకిల్‌ను నడిపించుకుంటూ, మల్లమ్మతో మాట్లాడుతూ పక్కమ్మటే నడుస్తున్నాడు.

"నడు, నడు" అని కోడలిని గద్దించినట్టుగ అంది.

ఇల్లు చేరినాక అడిగింది - "ఎవడాసైకిలోడు ?" అని.

మల్లమ్మ మాట్లాడలేదు.

"ఎవడాడు అంటే సప్పుడు సెయ్యవు ?" కాస్తా గట్టిగ అడిగింది.

"నాకు తెలవదు" అన్నది మ్లలమ్మ.

"తెలవంది నీఎమ్మటే ఎందుకు నడిసిండు?"

తెలవదు అని అనలేదు కాని, అన్నట్టు చూసింది మౌనంగా , అత్త మనసులోని అనుమానపు ఆలోచన గ్రహించి.

"ఎవడైంది తెల్వదు, ఎంట ఎందుకు నడ్సిండు తెల్వదు, మరి ఏం మాట్లాడిండో అదన్నా యినబడ్డదా?"

వినబడ్డ దన్నట్టు ముఖాన్ని పెట్టి "ఈ తోవ ఏ ఊరికి పోతది అని అడిగిండు" అన్నది.

"గది అడిగేతందుకు అంతదూరం నీ ఎమ్మటే నడవాలనా?"

మల్లమ్మ చప్పుడు చెయ్యలేదు. మూగగా అత్తనే చూస్తు నిలుచుంది. ఎదలో ఏదో దుఃఖపు అల కదిలి కనుకొలుకులను తాకి వెనక్కు వెళ్లింది.

"మనెమ్మటే వొస్తున్నోల్లందరూ ఎట్ల సూసిండ్రో

సూసినవా?" అంటు కోడలిని కోపంగ చూసి కిరసనాయిల్ కోసం అని సీసాతో ఊర్లోకి నడుస్తూ "అయినా కలుపు చేలోనుంచి ఎల్లంగనే సింగులను సరిసేసుకుని కొంగు నిండా కప్పుకొని నడిస్తే ఎవ్వడూ ఎంటరాడు, ఎదురైన ఆని దోవన ఆడే పోతడు కానీ ఎదను వొదిలేసి, పిక్కలు కాసరాంగ నడుస్తుంటే మొగోడు మాత్రం.." అని అనుకుంటు కొట్టు చేరింది. ఆరోజు నుంచి ఆమె కోడలును మరీ అనుమానిస్తూ వొస్తుంది.

**

రాములుకు అనుకోకుండా జ్వరం వొచ్చింది. అది ఆ తర్వాత రోగంగా మారింది. ఎవరో చేతబడి చేయించారు అని ఏడుస్తూ మంత్రాలు వేయించింది. తావీజులు కట్టించింది, వెచ్చాలు తినిపించింది. పచ్చిమందులు పోయించింది తల్లి.

భర్తకు బాగాలేకపోవటం వల్ల లోలోపల కుంగిపోయింది మల్లమ్మ. ఆమెలో వెనుకటి కళా, కాంతీ లేదు. తనకు ఏ అన్యాయం జరుగుద్దో అని తన పసుపు కుంకుమలు చల్లగ ఉండాలని కోరుకుంటూ ఉండేది.

అత్తలేనిది చూసి రాములును గుండెలకు హత్తుకొని వొళ్లంతా నిమురుతు కంట నీరు పెట్టుకున్నప్పుడు తన

భార్య కళ్లలోకి చూస్తు - "నాకేం కాదు. ఏడవకు పిచ్చి దానా" అంటు ఆమె కళ్లను తుడిచేవాడు. అప్పుడామె తన్నుకొస్తున్న దుఃఖాన్ని నోటిలో కొంగు కుక్కుకొని ఆపుకుంటూ "నావల్లనే నీకీ ఆపదొచ్చిందట. నేను సెని ముండనట, యింకా, యింకా - ఏందేదో కనపడ్డోల్లందర్కి సెప్పుతుంది మీఅమ్మ. సెట్టంత మనిషివి సేతకాకుంట అయిపాయె. ఈ గండం ఎన్నడు గట్టెక్కుద్దో అని కంటికి నిద్ర పడతలేదు. నా మొగుడు బాగుండాలే, నా సంసారం సల్లగుండాలె అని నాకు మాత్రం ఉండదా" ఏడుస్తూనే అన్నది.

"అమ్మ సంగతి అటు పక్కకు పెట్టు, ఏదీ ఒక్కసారి నవ్వు" అంటు బార్య ముఖంలోకి తాను నవ్వుతూ చూశాడు.

**

మూడు నెలల తర్వాత రాములు ఆరోగ్యం కుదుట పడింది. కాస్త అటు, ఇటు తిరుగుతూ ఉన్నాడు. దుర్గమ్మ మురిసిపోయింది. మల్లమ్మ ముఖం మళ్లీ కళ కళ లాడింది.

స్థలం మార్పిడి కావాలన్నారు కొందరు, వేరేచోట నిదుర చేయించాలన్నారు మరి కొందరు. అత్తగారి

ఇంట్లో నాలుగు రోజులు ఉండొస్తే సరిపోతుంది అన్నారు ఇంకొందరు.

దుర్గమ్మ తన కొడుకును పంపనంది. తన కొడుకుకు ఈ అవస్థ తన కోడలి వల్లనే వచ్చిందని గులిగింది. చివరికి పదుగురి మాటను కాదనలేక సరే నన్నది.

కొడుకు, కోడలును సాగసంపి ఇంటికొస్తున్న దుర్గమ్మకు పిల్లి అడ్డంగ వొచ్చింది.

ఇక ఆమె మనస్సు పరి పరి విధాల శంకించసాగింది.

రాములు అత్తగా రింట్లో పదిహేను రోజాలుండి కాస్త సత్తువను సంతరించుకున్నాడు. కొత్తరక్తం పోసి కొంత మెరుగు అయ్యాడు. భార్యతో, బావా మరుదులతో సరసంగా తిరిగాడు.

ఉన్నట్టుండి మళ్లీ జ్వరం తిరగపెట్టింది. అత్తవారింట్లో అందరూ ఆందోళన చెందారు. వెంటనే ఈ విషయన్ని ఆయన తల్లిదండ్రికి తెలియపర్చారు.

అది విన్న దుర్గమ్మ ఆఘమేఘాలమీద ఓ బండి కట్టించుకుని కొడుకుని తీసుకెళ్లడాని కొచ్చింది. మల్లమ్మ తల్లిని, తండ్రిని తిట్టిపోసింది. అంతేకాదు. తన కోడలిని రావద్దని శాసించింది.

మల్లమ్మ తల్లీ, తండ్రీ తెల్లమొఖం వేసి చూస్తు

నిలుచున్నారే తప్ప పల్లెత్తు మాట అనలేదు. మల్లమ్మ బండిలో వెళ్తున్న భర్తను చూస్తూ కుళ్లి కుళ్లి ఏడ్చింది. రాములు కళ్ళ నీరు పెట్టుకున్నాడు కానీ తన తల్లితో తన భార్యను తీసుకు రమ్మని చెప్పలేకపోయాడు. చెప్పినా వినదని అతని నమ్మకం.

రాత్రికి రాత్రే తన కొడుకును తిరిగి తన ఇంటికి తీసుకొచ్చింది.

కని, పెంచి, పెళ్లి చేసి - కొడుకు, కోడలు కలసి ఉంటే కళకళ లాడుతున్నది చూడాల్సిన తల్లులు ఎందుకిలా సాధిస్తారో అర్థం కాదు. అసలు ఏరి కోరి తెచ్చుకున్న కోడళ్లను ఎందుకిలా చూస్తారో - అన్న ప్రశ్న రాములును బాధిస్తోంది.

ఊరు చేరాక దుర్గమ్మ తన కొడుకుకు వచ్చిన ఆపద గురించి అందరికీ చెప్పింది. ఎందుకిలా అయిందని ఎరుక అడిగి చూసింది. కొలుపు చెప్పే దగ్గరకు తీసుకెళ్లి అచ్చకాయలను, పుచ్చకాయలను తీసేయించింది. అంతేకాదు అంజనం వేయించి తెలుసుకుంది. కోడలే ఈపని చేసిందని, అందుకే వాడు దాని వెంటే తిరిగేవాడని, అది ముదిరి ఇప్పుడు ప్రాణం మీది కొచ్చిందని అంచనా వేసుకొని నిజం అని నిర్ధారించుకుంది. ఆ విషయాన్ని

అందరికీ చెప్తూ కోడలిని, కోడలి తల్లిదండ్రులను తిట్టి పోస్తు శోకాలు పెట్టి ఏడుస్తూ శాపనార్థాలు పెట్టసాగింది.

జనం పంచాయతీ బోర్డు కార్యాలయం ముందున్న చింతచెట్టుకింద గుమికూడారు. చెట్టు మొదట చుట్టూరా ఉన్న అరుగుమీద సర్పంచ్ రాజిరెడ్డి, ఆయనకు అటూ ఇటూ సభ్యులూ కూర్చున్నారు.

అందరూ దీర్ఘాలోచనలో ఉన్నారు.

సులకమంచం మీద పడుకోబెట్టిన రాములు చింతచెట్టు కొమ్మల్లోకి చూస్తున్నాడు. కొమ్మల చివరన ఉన్న కాకి గూడు కనిపించింది. అతను తన చూపును తన పాదాల దగ్గర తలవంచి నిల్చున్న తన భార్య వైపు మరలించాడు.

కట్టుకున్నవాడు కాటి వైపు చూస్తుంటే ఏదో ఆశతో నిల్చుంది మల్లమ్మ.

"ఇది నా కొడుకుకు మందు పెట్టి సచ్చేటుట్టు సేసింది. సూడండి, ఎద్దసొంటి కొడుకు ఎట్లయిపోయిండో! అజ్జకారి నాసంతి, అది మాకిగ వొద్దే వొద్దు."

అది విని అక్కడ నిల్చున్న ఆడ, మగ అందరూ తమకు తోచినట్లు తలో మాదిరిగా అనుకుంటున్నారు.

"ముప్పయి ఏండ్లు దాటినా ఇంతవరకు పిల్లా, జల్లా లేదు. కడిది బలిసినట్టుగ బలిసి నా కొడుకును

మింగాలని చూస్తోంది."

దుర్గమ్మ ఇంకా గొంతు పెంచి, "పెద్దలారా! అయ్యలారా! మీ అందర్కి దండాలు. ఇడి కాయితం పెట్టించండి. దాని తోవన దాన్ని పొమ్మనండి."

మల్లమ్మ ఏ తప్పూ చేసినట్లు దాఖలాలు లేవు. మందు పెట్టిందన్న ఆరోపణ మాత్రమే బార్య భర్తలు విడిపోవడానికి ఏ రకంగానూ ఒప్పుకోదగ్గది కాదు. అందుకే అందరూ ఆలోచనలో పడ్డారు.

"ఈమె ఈ వూరి కోడలుగ వొచ్చిన నుండి ఏ చెడు వినలేదు. కూలి చేసుకుంటున్నా కులాసాగ ఉన్నారని విన్నాం." దుర్గమ్మ ఇచ్చిన దరఖాస్తును చేతిలో పట్టుకుని దాన్నే చూస్తూ అన్నాడు. సర్పంచ్.

"ఈ కథంతా అత్త కల్పించిందే. ఆల్లు బాగానే ఉన్నారు. ఈమే ఆల్లను సయిసనే సయిసదు. అది సూడ సక్కని దని కండ్ల మంటేమో మరి!" అంది రెండు చేతుల్లో రెండు కాలి పటవలను పట్టుకుని వనానికి పోతు ఆగి అక్కడే నిల్చున్న గౌండ్ల బాలమ్మ. ఆమెకు ఊరంతా తెలుసు.

"సూస్తందుకు మంచిగనే కనపడతది. కానీ లోలోపల ఇంత పాపానికి వొడి కడతదనుకోలేదు. తల్లో! ఏదో

కులమింటి పిల్ల ఈడూ–జోడూ బాగుందని ఇంత కాయకష్టం సేసుకుని బత్తరు అనుకున్న గానీ, ఇట్ల మాయ జేస్తదనుకోలేదు. నా ఇల్లు ముంచుత దనుకోలేదు దేవుడో!" అంటు నెత్తి బాదుకోసాగింది.

"మనిషి అన్నప్పుడు రోగం, నొప్పులు రావా, సావు బతుకులు లేవా? మందో, మాకో తినాలే, బాగా సేసుకోవాలే గానీ అయ్యిందానికీ కాని దానికీ అనుమాన పడితేట్లా? నీవు నాలుగు కాలాలు సూసిందానివి, నీకు ఇంకోగలు సెప్పాల్నా?" అంది బాలమ్మ

పంచాయతీ జరిగే చోట నలుగురు చేరటం, తమకు తోచింది తా మనటం మామూలుగా జరిగే విషయం. అందుకని సర్పంచ్ కాని, సభ్యులు కానీ ఎవరూ ఏ అడ్డూ చెప్పటం లేదు. బాధపడే మనిషిని ఆ మనిషి బాధ ఏమిటో చెప్పగలిగినంత చెప్పనిస్తే, కొంత బాధ తగ్గుతుందన్న నమ్మకం కలిగినవాడు సర్పంచ్.

"అసలు నాకు తెల్వాక అడుగుత దుర్గవ్వా! ఏం మందు పెట్టిందీ నీకోడలు? సచ్చేమందా, మరిగే మందా? సచ్చేమందైతే ఈ పాటికి ఆ డెప్పుడో పోవాలే! ఇక మరుగు మందు అందామా, దాని మొగుడు ఎప్పుడు దాని తోకమ్మటే నాయె. ఇగమందెందుకు ? అంత

నీఅనుమానం గానీ, ఇండ్ల జరిగిందేం లేదు" అంది బాలమ్మ ముక్కు మీద చూపుడు వేలూ, మూతి మీద మిగతా వెళ్ళనుంచి.

కోపంతో ముఖమంతా ఓ మాదిరిగా మారిపోయి మనిషంతా వణికిపోతూ, "అనుమానమా! బాగా సెప్పినవ్ తల్లి. మరి ఆ మాంసంల పడ్డ దేంది? దాన్ని నేను పెడితినా?"

"మాంసంలో మందు పెడితే తిన్నంక అరగకుంట అట్లనే ఉంటదా?" సర్పంచ్ ప్రశ్న.

"అరిగిందో, అరగలేదో పడ్డనైతే పడ్డది గదా ? సాచ్చం ఆ కక్కపోసిన ఎరుకలి సాయన్నను అడుగండ్రి." అంటూ ఎరుకలి సాయన్నను చూపించింది.

అందరూ ఎరుకలి సాయన్న వైపు చూశారు. అతను సర్పంచ్ వైపు చూస్తూ కొమ్మలు చెలిగిన తుమ్మలా నిల్చున్నాడు. నల్లగా, అర్ధనగ్నంగా. తిండి సరిగ్గా లేక కడుపు వెన్నుకు అంటుకుపోయి కడుపులో పేగులు ఉన్నట్లు కనపడటం లేదు.

"ఏమయ్యా! కక్కపోసినవా?" సర్పంచ్ ప్రశ్న

'ఆఁ' అన్నట్లు తలూపాడు.

"అంజనం గూడ ఏసి మందెవరు పెట్టింది. సూసి

సెప్పిండు." అంది దుర్గమ్మ.

"అంజనం గూడ ఏసినవా?" ఉప సర్పంచ్ ప్రశ్న.

అవునన్నట్టు తలే ఊపాడు. కళ్లు లోపలికి గుంజుకు పోయి రెప్పల్లో సత్తువ లేక వాలిపోయినట్లు ఉన్నాయి.

"అంజనంలో ఏం కనిపించింది?" సర్పంచ్ అడిగాడు.

"ఆ సూసిన పిల్ల అన్ని అందర్కి సెప్పింది."

అంటూ ఆ పిల్లను పిలవమని దుర్గమ్మకు సైగచేశాడు. ఆమె అటూ ఇటూ చూసి ఓ ఏడేళ్ళ అమ్మాయిని రెక్క పట్టుకొచ్చి సర్పంచ్ ముందు నిలబెట్టింది.

ఆ అమ్మాయి బిక్కు బిక్కుమంటూ చుట్టూ చూసి, సర్పంచ్ పైపు చూపు నిల్పి నెత్తి గోక్కుంటు నిల్చుంది.

"బిడ్డా అంజనంలో ఏం కనపడ్డది?"

ఏమో అన్నట్టు మూతి కదిలించింది.

"ఏం కనపడలె ? "

"చ్!" అంటు తల అడ్డంగ ఊపింది.

"మరి ఏమో సెప్పినవటగద"

"గీన సెప్పమంటె సెప్పిన" అంటు వేలితో సాయన్నను చూపింది.

"అంతెగాని నీకెం కనపడలె"

"ఉచ్! అంటూ తన తల్లి నిల్చున్న వైపు పోయింది.

"విన్నవా సాయన్నా ! తమరు చేసిన ఈ మూర్ఖపు పనికి ...." సర్పంచ్ పూర్తిగా అనకముందే

"పల్లాడగొట్టాల" గుంపులో నుండి ఓగొంతు అందుకుంది.

"వీని పని తరువాత చూద్దాం. తీసుకపోయి ఆపీసులో కూసొబెట్టు" అని అక్కడే వున్న పంచాయితీ కారోబారుకు చెప్పాడు.

"వీని పని ఇప్పుడే సూడాలి." కొందరు యువకులు సాయన్నను సమీపిస్తూంటే చేయి చేసుకోవద్దని సర్పంచ్ సైగ చేశాడు. అయినా ఆగక ఒకరిద్దరి చేతులు పడనే పడ్డయి.

"గుడ్డిగ నమ్మె వాళ్ళున్నప్పుడు ఎడ్డి సన్నాసి గూడ ఏదో ఒకటి చెపుతనే ఉంటడు." - ఆ ఊరి టీచరు.

"వీడే కాదు. వాని తండ్రి అదే పని సేసేవాడు. పొట్ట పోసుకోడానికి పుట్టెడు మోసాలు." ఓ పెద్ద వయసు వ్యక్తి.

"అది పోని, మంద్రైతే మాకండ్ల ముందే మాంసంల పడ్డది గద!" అత్త. ఆందోళనగ అందరివైపు చూస్తు అంది.

"గదెంత నిజమో, ఇది అంతే నిజం. మందుండదు

మాకుండదు. మంచి మాటే సాలు మరలుకుంటందుకు. ముక్కు మొఖం సక్కగుండి, మనస్సు మనస్సు కల్లా నీళ్లోలె కలసిపోతే సాలు, మందులు కావాల్నా మందు!" అంటు వనం వైపు నడిచింది బాలమ్మ.

ఆమె మాట విన్న అక్కడున్న వాళ్లందరు అదోమాదిరిగా ఆమె వైపు చూస్తూ ఆలోచించసాగారు.

"అనుమానమే కానీ, సమానమే కానీ అదైతే మాకొద్దు. ఏమయ్యా చెప్పవు?" అంటూ భర్తవైపు చూసింది.

"నేను సెప్తనే ఉంటిగద - అది అసలే వొద్దని." మల్లమ్మ తల్లిదండ్రుల వైపు చూస్తూ సర్పంచ్ - "మీరేమంటారు?" అని అడిగాడు.

"నా పిల్ల గోవులాంటిది. దాని మీద నింద మోపింద్రు. దానసోంటి బిడ్డలు ఆల్లకు ఉన్నరు.' అయిన ఈన్ని సేసుకొని నా బిడ్డ ఏమన్న సుఖపడ్డదా! కూలికి కూలి తప్పదాయె, బదనాం తప్పదాయె" అంటూ మల్లమ్మ తల్లి కళ్ల నీరు పెట్టుకుంది.

"భార్యా భర్తలను ఇడదీయటం పాపం. కొన్నేండ్లు కల్సి సంసారం సేసినంక ఇప్పుడది ఎటు పోతది, ఎట్ల బతుకుతది ?" అంది ఓ ముసలమ్మ.

"ఎట్లయ్యేది అట్లయితది. పెండ్లి ఖర్చు, మేమిచ్చిన

నగా, నట్రు అన్నిటినీ మా కిప్పియ్యండ్రి" అంది మల్లమ్మ తల్లి.

"నీ వేమంటవ్?" మల్లమ్మ తండ్రిని అడిగాడు.

"వొద్దన్నంక సేసే దేముంది, తండ్రి!" అనగానే పంచాయతీ పెద్దల గుండెలు తడైనాయి. పెరిగిన గడ్డంతో పేదరికంలో నలిగిన ముఖపు ముడుతలతో మరేం మాట్లాడకుండా చేతులు జోడించి నిల్చున్న అతని ఆ ఒక్క మాట చావడినంతా కొంతసేపు నిశ్శబ్దంగా మార్చేసింది. అవస్థలు పడుతున్న ఆడపిల్లల తండ్రు లందరు గుంపుగా అతనిలో కనిపించారు.

తనతో కలిసి, తిని, తాగి వియ్యమందుకున్న వెంకయ్య నేలను చూస్తున్నాడు.

మంచం మీద ఉన్న రాములు కదిలి సర్పంచ్, వైపు, తన భార్య వైపు ఏదో సైగ చేశాడు.

అది చూసిన సర్పంచ్ రాములు దగ్గర కెళ్లి "నీ వేమంటావ్?" అని అడిగాడు.

"ఏ ముంది అనడానికి" అని అన్నాడు చిన్నగా.

"నీ భార్యను ఒదిలిపెడతావా?"

మెల్లగా భార్యను దగ్గరకు రమ్మని సైగ చేసి, ఆమె వైపు మరలి ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని, "నేను సావను. తప్పక బతుకుత నన్నొదిలి పోకు" అని

రాములు ఎంతో ఆశతో అన్నప్పుడు మల్లమ్మ గుండె చెరువైంది.

ఆమె మంచం పక్కనే కూలబడి భర్త ఎదమీద తలపెట్టి భోరున ఏడవసాగింది.

రాములు శరీరంలో ఏదో కొత్త సత్తువ చోటు చేసుకోగా, అతను తన భార్య తలను నిమురుతూ తృప్తిగా శ్వాస పీల్చాడు. అతని కనుకొలకులు చెమ్మగిల్లాయి.

ఆ దృశ్యాన్ని చూస్తున్న సర్పంచ్ చెవుల్లో బాలమ్మ అన్న మాటలు.

చుట్టూరా ఉన్న జనం ఒక్కసారే ఏదో బరువును దించేసుకున్నట్టు శ్వాసను వదులుతూ అక్కడి నుంచి కదిలారు.

రాములు తల్లి, తండ్రి బొమ్మల్లా నిల్చుండిపోయారు.

ఓ కుక్క , పిల్లిని తరుముకుంటూ చావడి మధ్య నుండి పరుగెత్తింది.





# కరంట్ కథ

బావిలోని నీటిని బయటికిపోస్తున్న కరెంటు మోటారును చూస్తూ, బావిగడ్డ మీద నిలుచున్నాడు రాజయ్య. మోట తప్పింది, పాటు ఎరిగి పనిచేసుకొని, పుట్లకొద్ది పండించుకొని పిల్లలను చదివించుకోవాలి అనుకుంటూ పారుతున్న పొలంవైపు చూసాడు.

విత్తనం మొలకెత్తి, పెరిగిపెద్దై పంటకొచ్చేవరకు ఎంతకష్టపడాలి, ఎన్ని కళ్ళతో కాపాడాలి, తీరా పంట చేతికొచ్చేసరికి గాలిదుమారాలు, వడగళ్ళవానలు ఎన్నిటిని తప్పించుకుంటే పంట యిల్లు చేరుతుంది.

దొడ్డిముందు కుంపటిదగ్గర పడుకున్న కుక్క ఒక్కసారే అరవడం విని అటువైపు చూసాడు. ఓ జీప్ బావిగడ్డ వైపే వొస్తూవుంది. దాన్ని చూసి లేగదూడ తోకపైకెత్తి తల్లిమేస్తున్న వైపు పరుగుత్తింది. 'జీప్ లో వచ్చేది ఎవరన్న', అనుకుంటూ దాన్నేచూస్తూ, నిలుచున్నాడు. అది తాను నిలుచున్న గడ్డకు కొంచం దూరంలో ఆగింది. అందులో నుండి దిగిన ముగ్గురు తనవైపే వస్తున్నారు.

రాజయ్య వాళ్ళను గుర్తు పట్టాడు.

ముందు నడిచే యిద్దరిలో ఒకతను యస్.ఓ, రెండవతను లైన్ ఇన్స్పెక్టరు. వాళ్ళ వెనకాల మాసంగా చేతిరుమాలుతో, మధ్య మధ్యన నుదురును, మెడను వొత్తుకుంటూ నడుస్తున్న ఎ.ఇ. "వీళ్లెందు కొస్తున్నట్లు? తనతో వీళ్ళ కేంపని ? కరెంట్ బిల్ కూడా బాకీ లేదే. కొంపదీసి మోటర్పీక్కపోరు గదా!"

"రాజన్నా నీవు గడ్డ మీదున్నావ్. మమ్మలను గట్టెక్కించాలి" అన్నాడు ఎస్.ఓ. ముగ్గురూ గడ్డను ఎక్కే ప్రియత్నం చేస్తున్నారు.

"నేనే వస్త, జారి పడేరు." అంటూ తానే దిగొచ్చాడు. ఎన్నోసార్లు చేతులెత్తి దండాలు పెట్టిన రాజయ్యకు ఈరోజెందుకో చేతులు లేవలేదు.

"అక్కడ సింత కింద కూసుందురు పాండి" అంటూ కొంచెందూరంలో వున్న చింతలవైపు నడుస్తూవుంటే అందరూ ఆయన్ని అనుసరించారు.

పాపం ఎన్ని బాధలు వొచ్చినయి కొడుకులకు. నన్ను ఆపీసు సుట్టు ఇండ్ల సుట్టు తిప్పి తిప్పి సంపిరిగదా. అదె ఆరోజు యన్ ఓ గారింటికి నెయ్యిబుడ్డి తీసుకుని పోతె-

"దొర" అంటూ గేటు కొట్టాడు.

ఎవరు పలక లేదు.

సాయంత్రం ఏడు కావొస్తుంది.

"దొర దొర" అంటూ మల్లి కాస్త పెద్దగనే పిలిచి గేటును కదిలించి లోనికి తొంగి చూసి, ఇంట్లోనే సినిమా ఆడుతుందీ అనుకుంటూ అటేచూస్తూ నిలుచున్నాడు. ఎవరూ కదిలినట్టు కనిపించలేదు. మల్లీ గేటు కొట్టాడు.

"ఎవరు ?" అంటూ వచ్చింది యన్ఓగారి భార్య. మెడనిండా బంగారం. యింట్లో కూడా కాళ్ళకు చెప్పులా అనుకుంటూ చూస్తున్నాడు.

ఆమె గేటును సమీపించి. 'ఎవరు కావాలి ?'

"దొర"

"లేరు బజారు కెళ్ళారు"

"అయితే దీన్ని తీసుకోండి" అంటూ తాను తెచ్చిన నెయ్యి బుడ్డిని ఆమెకు అందిచ్చాడు.

"దొర తెమ్మన్నారా ?"

"ఆ"

"కిలో నెయ్యికే కరెంటొస్తదా ?" అంటూ కిలక్కున నవ్వుతూ లోపలికి నడిచింది.

రాజయ్యకు అర్థం కాలేదు ఎందుకు నవ్విందో. పూర్లో ఎవరైన చుట్టల పొగాకు పెడితే ఎంత ఇదిగ, మర్యాదపూర్వకంగా....

నెయ్యిని ఊరినుండి మోసుకొస్తే..... ఛో - ఛో అంటూ ఆఫీసువైపు మళ్ళాడు. అతని తలనిండా ఆలోచనలు అతని నడకకంటే వేగంగా.

ఆఫీసుకు చేరేసరికి అక్కడ గేటుపిల్లర్ నానుకొని వాచ్‌మన్ నిలుచున్నాడు. నోట్లో సగం వరకు కాలిన బీడి. రాజయ్య ఆయన దగ్గరికి వెళ్లి రెండుచేతులు జోడించి దండం పెట్టాడు.

"ఏం సంగతి ?" బీడీ నోట్లో నుండితీసి బూడిదను రాల్చుతూ

"అయ్యా ఏంలేదు యన్‌ఓ దొర ఇంట్లోలేరు. మాపటికి ఈడ జర పండుకుందామని" ఏమంటాడో అనుకుంటు

కొంచం జంకుతూ అడిగాడు.

"ఏ యింటికి పోయినవు ?"

"ఆయనింటికే అగో అక్కడ ఎదురుంగ వుందిగదా" అంటూ వెనక్కిమళ్ళి చూపించాడు.

"ఎఇగారి ఇల్లెక్కడ ?"

"అదిగో అటు, ఆ రెండవ ఇల్లు" అంటూ ఆఫీస్ ఆవరణలో వున్న క్వార్టర్‌ను చూపించాడు.

"అదా అదీ ఆఫీసే అనుకున్న" అంటూ రాజయ్య ఆయింటివైపు నడిచాడు. రూపాయలు దగ్గరున్నయి. కాలం బాగా లేదు. యిచ్చేది తప్పదు. యిచ్చేస్తే పీడ పోద్ది. అనుకుంటూ గేటుదగ్గర నిలుచున్నాడు. ఈ యింట్లో టీవీ సినిమా నడుస్తున్నట్లుంది. అందరు దాని ముందే ఉన్నట్లున్నారు. యిల్లు పెద్దగానే వుంది చెట్లుగూడ వున్నాయి. అవేమి చెట్లోకాయ లేదు పూవు లేదు. సక్కగ తాడిచెట్లంత పెరిగినవి. వీళ్ళకు ఇంతమంచి యిల్లు సర్కారోల్లు కట్టిచ్చారే. మా వూల్లో హరిజండ్లకు కూడ కట్టిచ్చింల్రు. అవి గాలికి లేసిపోయినయి.. వర్షానికి కూలిపోయినయి. వీళ్ళపనే బాగుంది. జీతానికి జీతం, ఎక్కి తిర్గేటందుకు జీపు. యింత మంచి యిండ్లు అనుకుంటూ అటూ ఇటూ చూసి

నిక్కి గేటుపై నుండి లోపలికి చూశాడు.

భౌ..భౌ.. మంటూ తోడేలులాంటి కుక్క లేచి తనముందటి కాళ్ళను గేటుమీద పెట్టి ఏమాత్రం అందినా కొరికేస్తా నన్నట్టు చూస్తోంది.

రాజయ్య "దియ్యో దియ్యో" అంటూ కూర్చున్నాడు. అది మొరుగుతూనే వుంది.

"రాజా—ఏయ్ రాజా' అంటూ 'లోపలినుండే కేక కుక్క కుయ్ కుయ్ మంటూ లోపలికి పరిగెత్తింది. రాజయ్య బిక్కు బిక్కు మంటూ లోపలికోసారి చూసి " నా పేరు ఈమెకెట్ల తెలుసు ! నన్ను పిలిచిందా, లేకుంటే కుక్క పేరు రాజా " అనుకుంటు మెల్లగా వెళ్ళి వాచ్‌మన్ దగ్గరికి వచ్చి నిలుచున్నాడు.

"ఏమయ్యా పటేలా వున్నారా ఎఱిగారు ?"

"తెలువదు"

"అడగలేదా ?"

"కుక్క దగ్గరికి రానిస్తలేదు"

"బయపడ్డావా ?"

"అమ్మో అదెట్టుంది !"

"అయినా సార్ యిప్పుడు యింట్లో వుండరు. క్లబ్బుకు పోవొచ్చు"

"క్లబ్ అంటే ఏంది సారు ?"

"క్లబ్ అంటే పెద్ద పెద్దోల్లు అడుకునే జాగ"

"రాత్రిపూట ఏమాట ?"

"పేకాట"

"అంటే అదే జువ్వ. తిరునాలల్ల ఆడతారుగ పైసల్ పెట్టి'

"ఆ అదె గదె"

"అయితె ఈస కంటె పెద్దదొర యిల్లెక్కడ ?"

"ఆయన ఇక్కడుండడు, హైదాబాదులో వుంటడు. రోజువచ్చి పోతరు".

"మిరి యీ ఎజ దొర గంట రెండు గంటల్లో వొచ్చెనా?'

"రాడు. ఆయనకు యింకో ఆమె వుంది. ఆమెకో యిల్లుకూడ ఈ మధ్య కట్టిచ్చిండు. అక్కడికి పోవచ్చు."

"అట్లనా ? ఆయనకు సర్కారు యిల్లు కట్టిస్తె, ఆయనేమో తన లంజమ్మకో యిల్లు కట్టిచ్చిండే!" అన్నాడు.

"ఆల్ల కేంది దొరలు సంపాదించినవన్ని ఎట్ల కరుసయితై"

"ఎట్లొచ్చినవి అట్లపోతవి"

వాచ్‌మన్ వరండాలోకి వెళ్ళి రెండు బెంచీలను జతచేసి వాటిమీద చెద్దరు పరిచి పక్క మీద వాలి రాజయ్య వైపు మళ్లి పడుకున్నాడు.

రాజయ్య ఓ కాలును స్టూలుమీద పెట్టుకొని, అదే మోకాలుమీద రెండుచేతులు పెట్టుకొని, ఆవేళ్ళ మీద గదమ నానిచ్చి ఆలోచిస్తూ కూర్చున్నాడు.

ఈ రోజుకూడ పని కాకపాయె. పగలు తనువొచ్చే సరికే ఎవరు లేరు.

"ఎక్కడో పెద్ద లైన్ చెడిపోతే అందరు పోయిండ్రంట" అన్నాడు వాచ్‌మెన్.

రాజయ్య ఆలోచిస్తూ ఆ పక్కనేవున్న బెంచిమీద వొరిగాడు. నిద్రపట్టింది. ఆరాత్రి గడిచింది.

"కరెంటు బాగా వస్తుందా?" లైన్‌మెన్.

"అయ్య మంచిగనే వస్తుంది." అంటూ గతంలోనుండి తేరుకొని నులకమంచాన్ని వాల్చాడు.

ఎ.ఇ.గారు యన్.ఓ.గారు దానిమీద కూర్చున్నారు.

ఎల్.ఐ.గారు చింతమొదట బోర్లించిన బొక్కెనమీద కూర్చుంటూ "ఇక దీనితో నీకు పనిలేదనుకుంట ?" అంటూ రాజయ్యవైపు చూసాడు.

"కరెంటు రాకుంటే మోటే గతి కదా. అందుకొరకె దాన్ని జాగ్రత్తగా అక్కడ పెట్టిన"

"కరెంటెందుకురాదు ?"

రాజయ్య చిన్నగా నవ్వాడు.

ఎందుకు నవ్వుతున్నావు అన్నట్టు కనుబొమ్మలను కదిలించాడు యన్.ఓ.

“వైర్లు తెగిపోయిన, ట్రాన్స్‌ఫారము కాలిన ఇంక అప్పుడప్పుడు కావాలని మీరే బంధు గూడ చేస్తరు గదా”

ఎందుకో ఒక్కసారి అందరికీ కొరడాతో కొట్టినట్లైంది. ఒక్కసారి ఒకరి మొఖం ఒకరు చూసుకున్నారు.

చింతకింద పడుకున్న గేదెలను చూస్తూ ‘ఏమైన ఈనినయా’ అంటూ మాటలను మార్చాడు యన్,ఓ,గారు

“ఈన్నయి ఉంటె అమ్మేసిన మొన్న”

మామీదికి మరోరాయి అందుకున్నట్టున్నాడు అనుకొని

“రాజన్నా”

“దొర” అంటూయన్.ఓ.గారి వైపు చూశాడు.

“నీకైతె కరెంట్ ఇచ్చినం. కాని మాపీకల మీదికొచ్చింది” అంటూ నుదురు ఓసారి తుడ్చుకున్నాడు.

“మీకా! ఎందుకు దొర? తాగినోడె కట్టె తాళ్ల పన్ను అన్నట్టు కరంటు పెట్టుకొన్నప్పుడే.....” అంటూ మంచం ఎదురుగ వున్న చిన్న గుండ్రాయి మీద కూర్చున్నాడు.

“ఈ వూళ్లో చాలా మంది నీకంటె ముందు దరఖాస్తు పెట్టారట వాళ్ళకు యివ్వక, మూడు స్థంబాలిచ్చి, నిన్న మొన్న ధరకాస్తు పెట్టిన నీకు యిచ్చామట.”

"మరి వాళ్ళకు....." మాట పూర్తి కాకముందే

"వాళ్ళు డబ్బులు ఇవ్వలేదట. నీవు డబ్బులిచ్చినావట. అందుకని నీకిచ్చామట"

"నేను డబ్బులిచ్చింది వాళ్ళు సూసిండ్రా ?"

"పై అధికార్లకు ధరఖాస్తు యిచ్చారు"

"యిస్తె ఏమైద్ది సాచ్చంతేంది- ?"

"అందుకే నీదగ్గరి కొచ్చాం" అంతవరకు మాట్లాడని ఎ.ఇ.గారు నోరు విప్పారు.

రాజయ్య ఎ.ఇ.గారి వైపు చూసాడు. ఎ.ఇ గారు రాజయ్యనే చూస్తున్నాడు.

"ఎదురుగ పోయి దండం దొర అంటె వినికూడ చేయెత్తని మనిషి, దరఖాస్తు పెట్టి ఏడాది అయ్యింది సార్ అంటె, అంతా యన్.ఓ గారు చూసుకుంటారు పో అన్నాయన ఈయాల నాదగ్గర కొచ్చిండు. నాసాచ్చం కావాలంట. నేను సేసింది సెపుత అంతే" అని మనస్సులో అనుకొని "నన్నేం సెయ్యమంటరో సెప్పండ్రి"

"ఏం చెయ్యక్కర్లేదు. మాకు నీవు ఎలాంటి లంచం యివ్వలేదని చెప్పాలంతే" అంత వరకు మంచం పట్టెకు ఆనించిన చేతులను వొక్క దగ్గరికి చేర్చి నలుపుకుంటూ అన్నాడు యన్.ఓ.

"ఈ రోజుల్లో లంచం లేకుండా ఎవరైనా ఏ పనైనా చేస్తున్నారా అని! తాను చెప్పినా నమ్ముతారా. లాభం కలిగే చోట లంచం. నష్టం వచ్చే చోటా లంచమే. పని చేసినందుకు లంచం, ఎద్దుకో సూదిస్తే లంచం, కరెంటు పెట్టుకున్నందుకు లంచం, కరెంటు నడిపిచ్చుకున్నందుకు లంచం, ఆకరికి పండించిన పంట అమ్మేటందుకు పోతే అక్కడ ధర పల్కేటందుకు లంచమేనాయె! ఈ లంచాల లోకంలో నేను లంచం యియ్యలేదంటే ఎవరు నమ్ముతారు?" అని ఆలోచిస్తున్న రాజయ్యనుద్దేసిస్తూ.

"రేపో ఎల్లుండో నీదగ్గర్కి ఎంక్వయిరికి వొస్తరు. వాళ్ళకు బస్ ఇంతే చెప్పు"

"నేను సెపితె నమ్ముతరంటరా!"

"చెప్పాల కాని ఎందుకు నమ్మరు" బొక్కెన మీద కూర్చున్న యల్.ఐ పక్కనే నిలుచున్న లైన్‌మెన్ వైపు చూస్తూ.

"అంతేకదా ?" లైన్‌మెన్ రాజయ్య వైపు చూస్తూ

"ఒకేల్ల ధర్మం తినమంటే-

డబ్బులిచ్చి ధర్మం తింటే లత్త కొట్టదు" మళ్ళి తానె-

"నేను చెప్పలేదండీ ? ఆయన ఇచ్చిన డబ్బులు ఆయనకు వాపసివ్వండి. అంతే, వేరే మార్గం లేదు."

అంటూ తనజేబు నుండి ఐదొందలు తీసి మంచం మీద వున్న డైరీమీద పెట్టాడు ఎ.ఇ.గారు.

'అంతేసార్' అంటూ తానే ఐదొందలు తీసి వాటిపైనే పెట్టారు యన్.ఓ.గారు

వాళ్ళను చూసి యల్.ఐ. ఐదొందలు

"మరి ఇ.ఇ.కిచ్చినయి సార్ ?" యన్.ఓ

"మీరు కలిపి యియ్యండి 'అడుక్కుందురుగాని"

మరో ఐదొందలు కలిపారు.

మొత్తం రెండువేలు.

వాటినే చూస్తున్న రాజయ్య "మిగతా ఐదొందలు?" అనుకుంటున్నాడు మనస్సులో. నోట్లను సరిచేసి మరో సారి లెక్కపెట్టి "ఇదిగో ఈ రెండు వేలు" రాజయ్య కియ్యబోయె సరికో, రాజయ్య లేచినిల్చుని 'ఇచ్చి తీసుకుంటె ఏంబాగుంటది. నేను సెప్పేది సెపుతాలేండ్రి'

"అమ్మమ్మ వద్దు. కేసు చాల సీరియస్ కొచ్చింది. ఛైర్మన్ గార్కి, మంత్రి గారికి కూడ ధరఖాస్తులు వెళ్ళినయి." అన్నాడు ఎ.ఇ.గారు

"మా ఉద్యోగాలు వూడుతయ్" అన్నాడు యన్.ఓ.

"ఊడితేంది? దొరలు బతకలేర? కూడపెట్టినయన్ని ఎటుపోతయి? మీ యిండ్లు, పెండ్లాలు, మీ ఆస్తులు అన్ని

సూస్తి గదా?" అని మనస్సులోనే అనుకుంటున్న రాజయ్యా నుద్దేశిస్తూ-

"ఇవి వుంచుకో స్టోర్‌లో ఇచ్చిన రెండొందలు రావు. వాడు ఆరోజే తాగేసుండొచ్చు. సెక్షన్ల యిచ్చినయి పంచుకొని కర్చు పెట్టుకోవచ్చు" యన్.ఓ

"అంతా పకీర్ సన్నాసులు ఇన్ని రోజులున్నాయ్"? ఎ.ఇ

"యిల్లు నావాబు కొడుకులేమో, అవును అంతేలే ఆఫీస్‌లొదిలి వూర్లో తిరిగే నవుకరు గాళ్ళంతా అంతే. ఏ ఊరికి పోతే ఆవూరు అత్తగారిల్లు అనుకుంటరు." అంటూ నిలుచున్న రాజయ్యా చూట్టూ అందరూ లేచి నిల్చొని రూపాయలను అతని దోసిటిలో వుంచుతూ మరీ మరీ బ్రతిమిలాడారు.

ఎ.ఇ. గారు భుజమ్మీద చెయ్యేసి నిమిరాడు.

యన్.ఓ గారు దోసిటిలో నోట్లుంచి ఆపై చేతులు పట్టుకున్నాడు. యల్.ఐ గదమ పట్టుకున్నాడు.

"రాజన్నా! మా బ్రతుకులు నీచేతిలో వున్నయి. పిల్లలు గలోల్లం" అంటూవుంటే రాజయ్యా అందర్నీ ఒక్కసారి చూశాడు. పిరికి కొడుకులు. "సచ్చు సన్నాసిగాళ్ళు" అని మనస్సులో అనుకుంటూ 'ఇగ

పదండి' అంటూ జీపు వైపు నడిచాడు. అతని వెంట వాళ్ళూ.

"ఏసిబి వాళ్ళుకూడా రావచ్చు."

"ఆల్లెవరు ?"

"లంచాలు తేసుకొనే వాళ్ళను పట్టుకునే వాళ్ళు."

"వాళ్ళూ లంచాలు తీసుకోరా ?"

నలుగురూ నవ్వారు.

జీపు దుమ్ము రేపుకుంటూ వెళ్ళిపోయింది.

"నీయమ్మ యీల్లకంటే ముందు వాల్లెవరో వచ్చి జరిగిందంతా అడిగి రాసుకొని పోయిన సంగతి ఈల్లకేంయెరుక! అయినా కష్టపడ్డ సొమ్ము యాడికి పోద్ది? సేరాల్సినకాడికే సేరింది." అనుకుంటూ రాజయ్య బావి వైపు నడిచాడు.

1990

# నిమజ్జనం

"ఆటో... ఆటో."

ఆటో వచ్చి ఆగింది.

"చిక్కడ్‌పల్లి"

"పాంచ్ రూపాయ్ జ్యాదా దేనా."

"మీటర్..."

"దానిమీదే"

"పదకొండు కాందే."

"బహెన్ సహీఀ?" తల బిరుసుతనాన్ని చూపుల ద్వారా విసురుతూ.

"నహీఁ" అంటూ జేబులో నుంచి చిన్న నోట్‌బుక్ తీసి ఆటో నంబరు రాసుకున్నాడా వ్యక్తి అసహనంగా.

"నెంబర్ ఎందుకు రాసుకుంటున్నవ్?"

"పోలీసులకు ఫోన్ చేయడానికి."

"అచ్చా" ఓ మాదిరి తల ఊపి, ఆవిరిలా వచ్చిన కోపాన్ని అణచుకొని, మెల్లగా నవ్వుతూ – "ఇగ కూర్చోండి. అంత కోపమైతే ఎట్లానండి ?"

ఏదో గొణుక్కుంటూ పెద్దమనిషి కూర్చున్నాడు.

ఎందుకో రుసరుసలాడుతూ ఆటోస్టార్ట్ చేశాడు యువకుడు.

ఆటో టాంక్‌బండ్ మీదకొచ్చింది. స్లోగా నడుపుతూ డ్రైవర్ వెనక్కు తిరిగి, ఆటోలోని వ్యక్తిని చూశాడు. ఎనభై ఏండ్లు, ఖద్దరు చొక్కా, ప్యాంట్. పాతకాలపు రిస్ట్ వాచ్, బాగా అరిగిన బంగారు రాళ్ళ ఉంగరం. డ్రైవర్ తన ఆలోచనలకు పదను పెడుతూ ఆటోను ఆపాడు. జేబులో నుండి సిగరెట్ తీసి ముట్టిచ్చాడు.

"చూడు, సిగరెట్ పొగ నాకు పడదు. తల తిరుగుతుంది" అంటూ గాలి ఫోర్స్‌కు తన వైపు వస్తున్న పొగను వెనక్కు నెట్టుతున్నట్టు ఎడమ చేతిని ఊపాడు

"నీ తల తిప్పాలనే."

"పట్టుమని పాతికేళ్ళు లేవు, ఏంటి చాలా వాగుతున్నావ్?"

"పోలీసులకు ఏదో ఫోన్ చేస్తానన్నావ్?" అంటూ చుట్టూ చూశాడు.

వాహనాల రాకపోకలు అంతగా లేవు. సిగరెట్ దమ్ము పీలుస్తూ పెద్ద మనిషి ముఖంలోకి చూశాడు. ముడుతలుపడ్డ ముఖంలో కొట్టొచ్చినట్టు కనపడే కోపం, కళ్ళద్దాల్లో నుండి తీవ్రంగా చూస్తున్న కనుగుడ్లు. సిగరెట్ పీల్చినప్పుడు దాని వెలుతురులో కనిపించగా–

"చేతకాని ముసలి పీనుక్కి ఎంత ఇది" అంటూ కళ్ళద్దాలను లాక్కొని, "ఏదీ ఇగ ఫోన్ చేయ్" అంటూ నవ్వాడు. ఎటూ కనరాక కళ్ళు నలుపుకుంటూ, సత్తువను కూడతీసుకుని –

"ఒరే వెధవ! నన్నేమనుకుంటున్నావురా? ట్రాన్స్‌పోర్ట్ అథారిటీకి చెప్పి నీ లైసెన్సునే కాన్సిల్ చేయిస్తా. నాబోటివాణ్ణే ఇంత ఇది చేస్తున్నావు. మామూలు వాళ్ళను ఎంత హైరాన్ చేస్తున్నావో? నీవు ఈ వృత్తికి తగవురా" అంటూ ఆటోలో నుంచి దిగే ప్రయత్నం చేయగా –

"అచ్చా గవర్నర్ సాబ్ - నీవు అన్ని చేస్తవ్, చేయిస్తవ్." కాలర్ పట్టుకొని అలాగే ఆటోలో అణచి పట్టాడు. అప్పుడే కరెంట్ పోయి చీకటి పరుచుకుంది.

**

అది సమతా హాస్పిటల్.

సికిందరాబాదులోని సరోజినీ దేవి రోడ్ పక్కనున్నటే ఓ పెద్ద ప్రైవేట్ ఆసుపత్రి. తన కాంటెస్సా కారు ఎందుకో స్టార్ట్ కాకపోయేసరికి డా॥ జయసేన "ఆటోను పిలు" అన్నాడు డ్రైవర్‌తో.

ఆటో వచ్చి ఆగగానే అందులో నుంచి డ్రైవర్ మీటర్ వేశాడు.

"చూడు. కారును సరిచేసుకుని గంటలో అక్కడికి వచ్చేయ్. అడ్రస్ తెలుసు కదా ?" అంటు ఆటోలో కూర్చున్నాడు.

"తెలుసు. చిక్కడ్‌పల్లి."

"పోనీ"

ఆటో కదిలింది.

"మీటింగ్ స్టార్ట్ కావచ్చు" అనుకుంటు వాచ్ చూసుకున్నాడు.

"ఏం మీటింగ్ సార్ ?"

"ఓ సంస్మరణ సభ."

"అంటే?" అంటు ఓసారి వెనక్కు మళ్లి చూశాడు.

"పెద్దవాళ్ళు పోయినప్పుడు ఆయనకు సంబంధించిన వాళ్ళందరూ కలుసుకొని ఆయన గూర్చి ఆయన చేసిన పనుల గూర్చి చెప్పుకుంటారు". అని కాసేపు ఆగి మళ్ళీతానే -

"ఈమధ్య ఓపెద్దాయన పోయారు."

"మీ సుట్టమా సార్ ?"

"అంతకంటే ఎక్కువే. నాకేకాదు, చాలమందికి కూడా. గొప్ప మేధావి. ఆయనతో మాట్లాడడమే ఓ అదృష్టం. మేం కలుసుకున్నపుడు ఎన్నో విషయాల మీద మాట్లాడుకునే వాళ్ళం. ఆయనో నడుస్తున్న గ్రంథాలయం."

"ఆ" చూపు రోడ్డు మీద, మ[illegible] మాటల వైపు వుంచుతూ అన్నాడు.

"ఈ దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడిన వ్యక్తి. ఆ రోజుల్లో ఆయన మిత్రులు పాటలు రాస్తే, వాటిని సభల్లో పాడించి, జనాన్ని కార్యోన్ముఖుల్ని చేసిన ఉద్యమకారుడు."

"నీవెంతవరకు చదువుకున్నావ్?"

"ఏడవ తరగతి వరకు."

"అయితే, నీకు ఆయన గూర్చి తెలియదు. నీవు నిన్న మొన్నటివాడివాయె."

"అవును సార్."

"రామనాథం గారని, చదువుకున్న వాళ్ళకు తెలుసు. ఆయన తన రచనల ద్వారా అందర్నీ ఆలోచింపచేసేవారు. మొన్నటి వరకు ఏదో ఒకటి రాస్తూనే ఉండేవారు. నేను ఆయన ఫ్యామిలీ డాక్టర్ను. ఎప్పటి నుండో వయస్సు పైబడుతూ ఉన్న కొద్దీ వచ్చే రోగాలు, నొప్పుల నుండి ఆయనను కాపాడుతూ వచ్చాను. ఇంకా కొన్నాళ్ళు బ్రతికేవాడే, బ్రతికితే బాగుండేది."

"మరెట్లా సచ్చిండో?"

"అదే తెలియటం లేదు."

ఆటో టాంక్‌బండ్ మీద నడుస్తోంది.

"ఈబొమ్మలున్నాయ్ చూడు, ఆ రాజుల బొమ్మలు ఎందుకు పెట్టారో నాకు తెలియదు. వాటిని వొదిలేస్తే మిగిలిన వాళ్ళల్లో కొందరి భావాల వారసుడు ఆయన. వీళ్ళ ఆలోచనలను ఈ తరం వాళ్ళకు పంచిన గొప్ప మేధావి."

ఆటోను స్లో చేసుకుని, కూల్ డ్రింక్ బంకు ముందు

ఆపి-

"మీరు ఏమైనా... ?"

"నే, నీవు తాగిరా" అంటూ తన చూపులను శ్రీశ్రీ మీదనుండి మఖ్దూమ్ మొహియొద్దీన్ వైపు మరలించి, ఆ తరువాత చెరువులోని నీళ్ళవైపు చూస్తూ కూర్చున్నాడు. తల నిండా గతం తాలూకు ఆలోచనలు, కళ్ళ నిండా రామనాథం గారి రూపం.

ఓ సోడా తాగి, ముఖానికి పట్టిన చెమటను తుడుచుకొని ఆటో స్టార్ట్ చేసుకొని కదిలాడు.

"డాక్టర్‌గారూ, మీరు చెప్పిన ఆ పెద్దమనిషి ఎట్లా సచ్చింది నేను చెప్పనా....?"

ఏదీ చెప్పు అన్నట్టు చూశాడు.

"మీరన్న ఈ బొమ్మలు చూస్తుండగనే ఇదే చెరువులో దుంకి సచ్చిండంట."

"అవునా?"

"అవును, వల్లు బాగా లేక డాక్టర్‌కు సూపించుకొని వొస్తూ వొస్తూ, కడుపులో నొప్పి ఎక్కువై తట్టుకోలేక'

"నేననుకోను"

"తమరనుకోకపోయినా"

"ఆయనకు కడుపు నొప్పేమిలేదే!"

"ఉందని అందరూ అంటున్నారు"

"అలాగా!"

"ఆ పీనుగను తీసి ఈకట్టమీదనే గదా పోలీసోల్లు పంచనామ చేసింది ?"

"పత్రికల్లో చూశా. నాదగ్గరికే వచ్చి చూపించుకున్నాడు. మంచిగనే ఉండె. ఆ రోజు ఆయనకు ఏమనిపించిందో జేబులోనుండి కొన్ని నోట్లు తీసి "ఇన్నాళ్ళ నుండి మీరు నాకు వైద్యం చేస్తున్నారు. ఎప్పుడూ ఏం తీసుకోలేదు వీటిని ఉంచండి" అన్నారు. నేను వద్దని మళ్ళీ ఆయన జేబులోనే పెట్టి, "మీరు సమాజానికి చేస్తున్న సేవల్లో నేను మీకు చేసేది ఏమాత్రం?" అని పంపించాను."

"ఆయన జేబులో ఏమీ లేవట."

"అదెట్లా? డబ్బే కాదు," అనేలోపే-

"బతికున్నప్పుడే దోచుకుంటున్న ఈ రోజుల్లో సచ్చినాక ఎవరుంచుతారు సార్! ఆరోజు అంటూ ఉండిరి. పోలీసోల్లే కొట్టెయ్యొచ్చని"

డాక్టర్ మౌనంగా విని "అంత గొప్పవాడు ఇలా ఎందుకు చస్తాడా అని..."

ఆటో అంబేడ్కర్ విగ్రహం ముందు నుండి

వెళుతోంది. ఎందుకో ఒళ్ళంతా జలదరించినట్లయి స్పీడ్‌ను పెంచాడు.

"తమరు గొప్ప గొప్ప అంటున్నారు - నాలుగు రోజులైనా పీనుగను గుర్తు పట్టే దిక్కే లేదట."

"అదే ఆయన అలా చస్తాడని ఎవరూ అనుకోరు గదా!" కొంతసేపు ఇద్దరి మధ్య మౌనం చోటు చేసుకుంది.

"గవర్నర్, ముఖ్యమంత్రి ఆయన గురించి మాట్లాడినట్టు పేపర్లో వచ్చింది. ఆయనే గదా మీరనేది ?"

"ఆఁ ప్రధానమంత్రి కూడా ఫోనులో తన విచారాన్ని వెలిబుచ్చాడ ".

కొంతసేపు ఇద్దరి మధ్య నిశబ్దం ఆటో వేగంగా వెళుతూ వుంది.

"ఆపు" అంటూ ఆగిన ఆటో దిగి, మీటర్ చూసి పైసలిచ్చి సభవైపు నడిచాడు. అప్పటికే రావలసిన వాళ్ళందరూ వచ్చి కూర్చున్నారు.

ఆటో డ్రైవర్ సిగరెట్ అంటించుకొని సభా వేదిక మీద ఉన్న ఫోటోను చూశాడు. అదే ఫోటో! ఆ మధ్య పేపర్లొచ్చిందే! వేళ్ళ మధ్య వెలుగుతున్న

అగ్గిపుల్లను ఆర్పి నేలమీద విసిరాడు.

అంతవరకు ఓ పక్క తన రిక్షాను ఆపుకొని, అందులోనే కూర్చొని ఉన్న రిక్షా అతను దిగి, ఆగిన ఆటో దగ్గరికి వచ్చి-

"జర మాచ్చాసు ఇయ్యో బాయి సాబ్" అంటూ అడిగాడు.

ఆటోవాడు అగ్గపెట్టెను అందిచ్చాడు. బీడీని వెలిగించుకొని దమ్ము పీల్చి అగ్గిపెట్టెను తిరిగి ఇస్తూ –

"సావునాడు ఎవరూ లేరు. దినం నాడు ఎంత మందొచ్చింర్డో సూడు." అంటు పీల్చిన పొగను ముక్కు గుండ వొదిలాడు:

ఏవో ఆలోచనల్లో మౌనంగా ఉన్నాడే తప్ప, మాట్లాడలేదు ఆటోవాడు.

"సావునాడు నేనే, నా రిక్షాలోనే పీనుగను ఓ గుడ్డలో చుట్టుకొని కాష్టాల గడ్డకు తీసుకుపోయినా. కొడుకు – కోడలు , ఇంకా నలుగురైదుగురు – ఏం కావాల్నో తెలియదు."

"అట్లనా!"

"మాబస్తీల ఎవరన్న సస్తే, బస్తీ బస్తీకి సెప్పంపి,

ఆయల్ల అందరం పని బందు సేసి సావు సేస్తం. ఎవ్వర్కి సెప్పనట్టుంది. ఈ యల్ల ఇంత మంది వొచ్చినోళ్ళు ఆయల్ల కొందరైనా రాతే."

"కాష్టం కాల్చి బూడిదైతే చేసింగ్రు గదా."

"సెయ్యకుంటే అప్పటికే ఆ సెర్ల చేపలు, కప్పలు ఏమేమ్ పీక్కతిన్నయో" అని కాలి ఆరిపోయిన బీడీ ముక్కను పారేస్తూ అన్నాడు.

"అసలీ ముసలోడు అండ్ల ఎట్ల పడ్డడట ?" అంటూ జేబులో నుండి గుట్క ప్యాకెట్‌ను చించి, కొంత పొడిని నోట్లో వేసుకున్నాడు.

"ఎవరు సరిగ సెపుతుంగ్రని? నలుగురు నాలుగు రకాలుగ అనుకుంటుంగ్రు. ఈయాల్దాక ఓ పెద్దాయన అంటుండె."

"ఏమని?" నోట్లో గుట్క పొడిని నములుతు.

"ఆయనంతటాయన సెర్ల దూకి సచ్చేటోడైతే కాదు అని"

"మరి నువ్వేమంటావు సెప్పు"- రిక్షావానికో సిగరెట్ ఇచ్చి, దానిని తానే అంటిస్తూ అడిగాడు.

"ఆ ఉన్నయన్ని గుంజుకొని ఎవడో చెర్లోకి నూకేసినట్టుంది." సిగరెట్ దమ్ము లాగుతూనే

ఆటోవాని ముఖంలోకి చూస్తూ అన్నాడు.

"నువ్ సూసినవ్ బే" అంటూ కోపంగా చూస్తూ చేతిలో కాలుతున్న అగ్గిపుల్లను రిక్షావాని మీద విసిరి, ఆటోను స్టార్ట్ చేసుకుని అక్కడ నుంచి స్పీడ్‌గా వెళ్ళి రోడ్డెక్కాడు.

**

నాలుగు గుంటల ఖాళీ స్థలానికి చుట్టూరా కాంపౌండ్ తిప్పగా ఓ మూలన రేకుల షెడ్ ఉన్నది. అందులో నుండి అందరికి సారా సరఫరా జరుగుతూ ఉంటుంది. దాన్నిండా తాగే జనం.

"కొందరు హత్య అనుకుంటుంద్రన్న."

"అనుకోనీయ్." - తన చిన్న గడ్డాన్ని చేత్తో దువ్వుకుంటూ.

"నాకు భయమైతుందన్నా." - బిత్తర బిత్తరగ చూస్తూ.

"అట్లనా, ఇంకింత తాగు." అంటూ తన గ్లాసును ఖాళి చేసి కింద పెట్టాడు.

"ఆ ముసలోడు మామూలు మనిషి కాడన్నా."

"కాకపోని, ముసలోడే కదా. నీవు సంపకున్న ఇంకిన్ని రోజులకు ఆడైనా సచ్చేటోడే గదా! గాదాని

కెందుకింత పరేషాన్." తన ఎడమ చేత్తో అతని తలను నిమురుతూ అన్నాడు.

"పోలీసోల్లు గూడ అతనే సెర్ల దూకిండని రాసేసింర్రు. కేసు ఖతం చేసింర్రనుకో."

"మరి గంతే" అంటూ సీకుకు గుచ్చి కాల్చిన మాంసపు ముక్కను లాగి నోట్లో వేసుకొని నములుతూ, మిగిలిన ముక్కలవైపు చూస్తూ -

"నీకు సెరిత్ర తెలుసా?"

"ఏదో కొంచెం."

"అంత పెద్ద గాంధీ మహాత్ముని గింత ముండ కొడుకు గింతటోడు, ఆడు అంతకు ముందు ఎవ్వనికి తెల్వదు. అంత మందిల అందరు సూస్తుండగ పిస్తోలుతో కాల్చి సంపేయలే? ఏ దునియా హై మియా. అన్నీ నడుస్తనే ఉంటయి. నువ్వేం ఫికర్ సేయకు. అరేయ్ పిల్లగా, ఇంకా రెండు చప్టీలు పట్టుకరా."

"అచ్చా దాదా."

కొంతసేపు ఇద్దరి మధ్యా నిశ్శబ్దం. చుట్టూరా రకరకాల శబ్దాలు.

"అరె తినుర బై, ఇంకో బేజా తిను." అంటూ

ఎదురుగా ఉన్న ఆకుడొల్ల వైపు చూపులతో చూపించాడు.

"కడుపుల భయం, భయం అయితుందన్నా."

"అరె నువ్ సెప్పితే ఇనవ్, ఎక్కువ సోంచాయించక్. భయం పడితేనే భయం – " అన్నాడు సైదులు దాదా.

"కళ్ళు తిరుగుతాన్నయన్నా." అంటూ ఎడమ చేత్తో కళ్ళు మూసుకొని, తలను మోకాళ్ళ మధ్య ఆనించు కున్నాడు. మూసుకున్న కళ్ళలో –

"అరె, నాకాలర్ పడతావురా వెధవా? నేనెవరనుకుంటున్నావు?"

"ఎవరైతే నాకేం బే, ఏం పీకుతవ్ ?" అంటూ గొంతును –

"వొదులు, వొదులు...ఇప్పుడే ఐ.జి.పికి ఫోన్ చేసి నీపని..."

"హ్హా....హ్హా...సెయ్యి...సెయ్యి. "

"నిన్ను ....నిన్ను ....నీ....నీ...."

శబ్దం బంద్ అయ్యింది. కళ్ళు అట్లాగే తెరుచుకొని ఉండిపోయాయి. ఆ తర్వాత శ్వాస ఆగిపోయింది.

జేబులోని రూపాయలు, చేతి గడియారం, వేలి

ఉంగరం తీసుకున్నాక, ముందు శవం, తరువాత చెప్పులు, కళ్ళ అద్దాలు చెరువులోకి చేరాయి. ఆటో నంబర్ రాసిన నోట్‌బుక్‌కు అగ్గి అంటుకుంది. అంతా అయినాక ఓసారి చుట్టూ చూశాడు. ఎవరి పని మీద వాళ్ళు. వాహనాల పరుగు మామూలే. ఎవరూ చూడలేదని నిర్ధారణ చేసుకొని ఆటోను హైద్రాబాద్ వైపు నడుపుతూ ఉంటే, అక్కడ విగ్రహాలన్నీ తాను చేసిన పనిని చూపిస్తున్నట్టు అనిపించి, ఒళ్ళంతా చెమట పట్టింది.

ఎవరో "ఆగు" అన్నట్టు వినిపించింది ఎదురుగ చూపుడు వేలు! అంతే, గొంతులో తడారి పోయింది. కళ్ళు బైర్లు కమ్మాయి. తమాయించుకొని చూశాడు. అది అంబేద్కర్ విగ్రహపు చూపుడు వేలు! ఆటోను స్లో చేసుకొని, కళ్ళను ఓసారి మూసి తెరచి, ఎడమ చేత్తో కాసేపు ఎదను అదిమి పట్టుకొని, ఓ బరువైన శ్వాసను వదిలాడు. ఎదురుగా ఆటోమేటిక్ ట్రాఫిక్‌లైట్ ఎర్రగా మారింది.

రాత్రి పదకొండు దాటింది. ఖాళీ ఆటో సచివాలయం ముందు నుండి టాంక్ బండ్ వైపు వెళుతూ, తెలుగుతల్లి బొమ్మ ముందుకొచ్చేసరికి అక్కడి చిక్కని

వెలుతురుకు కళ్ళు మూతలు పడ్డట్టు అనిపించగా, కాస్త స్లో చేసుకొని పక్కకు ఆపుకున్నాడు. జనం రాక పోక అంతగా లేదు. దేన్ని మరచి పోవడానికి తాగాడో, మైకం ఎక్కువౌతూ అదే మరి మరి గుర్తుకురాసాగింది. కళ్ళు నలుపుకున్నాడు. పళ్ళు కొరుక్కున్నాడు. ఆటో దిగి చుట్టూ చూసి సచివాలయం వైపు మళ్ళి.

"అందులో పైసలున్నోని పనే అయితది, లేనోని పని కానే కాదు. రాను రాను రాష్ట్రాన్నే అఱ్రాజ్ సేస్తరు" అంటూ గొణిగాడు.

తలపైకెత్తి నౌబోతు పహాడ్ మీదున్న బిర్ల మందిర్ వైపు చూసి,పడి పడి నవ్వి "మనుషులు ఫుట్ పాత్ మీద నిద్ర, బొమ్మలు గుల్లల్లో పవళింపు వారెవా బిర్లా మనుషుల దగ్గర లాగి దేవుళ్లకు అర్పితం. భలె భక్తులు!" కళ్ళు మూస్తూ తెరుస్తూ నవ్వాడు.

ఎల్.ఐ.సి భవనం వైపు మళ్ళి, "ఈల్లు అసలు బేరగాళ్ళు, బతికున్నన్ని రోజులు వసూలు చేసి సచ్చినంక డబ్బులిస్తరట. ఎవరికి?" అంటూ ఈసడింపుగా చూశాడు.

మరొకసారి చుట్టూ చూసి మింటువైపు మళ్ళి,

"ఇక్కడ తయారయ్యే డబ్బంతా ఎటు పోతున్నట్టు? ఎవరు పంచుకున్నట్టు? సెప్పు - సెప్పు " అంటూ తెలుగుతల్లి బొమ్మ వైపు నడుస్తూ నిలదీస్తున్నట్టు అడిగాడు.

బొమ్మ వెనకనుండి సైరన్ చప్పుడు చేస్తూ పోలీస్ వ్యాన్ వస్తోంది. అది తన వైపే వస్తూ ఉండడం తన కోసమే వస్తున్నట్టు అనిపించింది. కళ్ళల్లో భయం. కాళ్లల్లో వణకుతో ఆటోను స్టార్ట్ చేసుకొని వేగంగా ఓవర్‌బ్రిడ్జి వైపు పోనిచ్చాడు. గుండె వేగం పెరిగిన కొద్దీ భయం పెరగసాగింది. భయం పెరిగినకొద్దీ ఆటో స్పీడ్ పెరిగింది. వెనుకనుండి ఎవరో తరుముకొస్తున్నట్టు వెనక్కు మళ్ళిమళ్ళి చూస్తూ, తాను ఎంతస్పీడ్‌గా వెళ్ళేదీ, ఎటు వెళ్ళేదీ గమనించే స్థితి దాటి..బుద్ధ విగ్రహం నీటిలోకి దించిన పల్లం వైపు ఆటో రోడ్డు దాటి పరిగెత్తి, "చర్ర్" న నీటిలో పడి "డుబ్ డుబ్" అంటూ మునిగిపోయింది.

1993

●

# సాలిని

హైదరాబాదులోని మధ్యతరగతి వాళ్ళు నివసించే బస్తీ అది. ఎప్పుడో కట్టిన యిండ్లు కావటం వల్లా మిద్దెలు, పెంకుటిండ్లు గానే మిగిలి పోయిన ఆ ప్రాంతంలో చిన్న వరండా, బాత్‌రూం గల ఓ గదిని కిరాయికి తీసుకుని ఉంటుంది సాలిని.

బయటికి వెళ్ళటానికి గదికి తాళం వేసి 'కీ'ని బ్యాగ్‌లో వేసుకుంటూ రోడ్డు వైపు నడిచే సరికి ఎదురుగా ఆ బస్తి యువకులు, వయసు దాటిన ఆడ వాళ్ళు వచ్చి నిల్చున్నారు.

సాలినికొంగు భుజాల చుట్టూ కప్పుకుంటు 'ఏమిటి' అన్నట్టు చూసింది.

అందరూ మౌనంగా నిలుచున్నారు. రోజూ చూస్తున్న వాళ్ళయినా ఒకేసారి వచ్చి ఎదురుగా నిల్చుండేసరికి కొంచెం కలవరం అన్పించినా, విషయం ఏమిటో తెలుసుకోవాలని నిశ్చలంగా నిల్చుంది సాలిని.

"చెప్పండి నాతో ఏమైనా పనా ?"

"పనేమీ లేదు, రోజు ఎక్కడికి వెళుతున్నావు ?" ఓ యువకుడు పాంట్‌జేబుల్లో తన చేతులను దూర్చి నిర్లక్ష్యంగా చూస్తూ అడిగాడు.

"నా పనిమీద నేను"

"అదే ఏంపని?" మరో యువకుడు తన రెండు చేతులను' మెడ మీద వుంచి, వేళ్ళమధ్యకు వేళ్ళు దొప్పించుకుంటూ అడిగాడు.

తాను చేస్తున్నపని వీళ్ళకెందుకు చెప్పాలో అర్థం కాక ఏమిటి గోల అన్నట్లు ఆడవాళ్ళ వైపు చూసింది.

"ఆమె ఏం పనికి పోతే మనకెందుకు మనక్కావలసింది యిల్లు ఖాళీ చెయ్యడమే గదా" అన్నది ముందు నిలుచున్నావిడ సాలిని వైపు చూడకుండా అడిగిన వాళ్ళ వైపు మళ్ళి.

"అంతే అంతే" అన్నారు దాదాపు అందరూ ఒకేసారి.

మరో ముసలమ్మ కాస్త ముందకొచ్చి "సూడమ్మా, బస్తీల రోజు నీగురించె గుస గుస. వొచ్చినప్పుడు ఓ మాదిరిగ వుంటివి, రాంగ రాంగ ఎట్లనొ మారిపోతుంటివి. పొద్దున పోతవు పొదుగూకి వొస్తవు. మళ్ళీ రాత్రి ఏడింటికి పోతవు సిన్మా వొద్లినంక వస్తవు' అంది.

"ఏదో ఓ పని చేస్తేనె గద·గడిచేది పొద్దంతా పొట్ట పోసుకోవడానికి, రాత్రి బాధలను మరిచిపోయి బతుకు మీద మమకారం పెంచుకోవడానికి పోక తప్పదు" చేతిలోని బాగ్‌ను బుజానికి వేసుకుంటు అంది.

"నీపనె నీవు జేసుకుంటవు గాని, రోజుకొకరు స్కూటర్ మీద, మోటర్ మీద దించి పోతుంఁడాయె. పెండ్లి కాలేదంటివి యింతమందితో తిర్గుతుంటివి. అందుకె ఈ బస్తీల వుండొద్దు అంటుంఁడు," అంది ఆ ముసలమ్మ.

"మనం మంచిగుంటె ఎవ్వరితొ తిరిగితె ఏమైందవ్వా" ముఖాన చిరు నవ్వును పూయిస్తూ ముసలమ్మను ఉద్దేశిస్తూ అంది. కాని ఆ అడగడం అందర్ని ప్రశ్నిచినట్లనిపించింది.

"ఏంమంచొ ఏం చెడొ ఈయల్ల రేపు కాలం నమ్మ రాకుంట వుంది." అంది, ఎడమ చేతిని కడుపు మీద పెట్టుకుని కుడి చేతిని నోటికి అడ్డంగా పెట్టుకుంటూ.

"ఈమె తిరుగుడు పొంగ మనరాజేష్‌ను తిట్టిందట, గోపాల్‌ను తిట్టిందట. పడుసు పోరగాండ్లను తిడితె వూర్కుంటర? ఎవ్వర్నని ఆపుతము" అంది మొదటావిడ ఓమాదిరి నిష్ఠూరాన్ని ప్రదర్శిస్తూ.

"మీరు యింత మంది ఒకేసారొచ్చి యిట్ల అడిగితె యిప్పుడేమి చెప్పలేను. యిల్లు ఖాళీ చేయ్యాలంటె మరో యిల్లు చూసుకుని ఖాళీ చేస్త. నాకు టైమైంది" అంటూ రోడ్డు వైపు నడిచింది. ఆ నడకలో కొంత విసుగు, మరికొంత కోపం కనిపించింది.

"హా! యీమధ్య చీరల మీద చీరలు కడుతుంది బొమ్మ" అంది ఓ స్త్రీ. ముక్కు మీద వేలుంచి, పోతున్న ఆమెనే చూస్తూ.

"కొనిస్తోల్లు వుంటె ఎందుక్కట్టదు ?" ఏదో రహస్యాన్ని ప్రకటిస్తున్నట్లు అన్నాడు ఓ నడి వయస్సు వ్యక్తి.

"అవన్ని మనకెందుకు ఖాళీ చేస్తనంది గదా" అంటూ అందరూ అక్కడి నుండి కదిలారు రకరకాల ఆలోచనలతో.

ఆమె రిక్షాను పిలిచి మాసాబ్‌టాంక్ అంటూ కూర్చుంది.

సాలిని తలనిండా ఆలోచనలె–

ఆడదాని బతుక్కు అన్ని ఆటంకాలె, తాను ఆడదిగ పుట్టినందుకు తనను తాను తిట్టుకుంది. చదివినా

వుద్యోగం యివ్వని ప్రభుత్వాన్ని తిట్టింది. తన పని తాను చేసుకొని తన బ్రతుకు తాను బ్రతుకుతుంటె చూసి వోర్వలేని జనాన్ని తిట్టింది. అప్పుడప్పుడెమ్మిడిపడి అవస్త పెట్టే కుక్కబుద్ధిగల మనుషులను తిట్టింది. ఆఖరికి ఈ రోజు యిల్లు ఖాళీ చేయమన్న వాళ్ళను తిట్టింది. ఈలోగా రిక్షా మహావీరు హాస్పిటల్ ఎదురుగ వెళ్ళగానె, "ఆ ఆపు" అంటూ దిగి, యివ్వవల్సినంత రిక్షావాని చేతిలో పెట్టింది.

ఎదురుగ నవ్వుతూ ఓ కళ్ళద్దాల యువకుడు.

చూపులతో పలుకరించుకున్నారు. నవ్వులతో కలిసి నడిచారు. కొంతదూరం నడిచాక "మీరు ముందు నడవండి." అని కాస్త ఆగి ఆమె వెనకాలే ఆమె నడకను, నడిచేటప్పటి కదలికలను తన కను రెప్పల కింద పేర్చుకుంటూ నడుస్తున్నాడు.

సాలినిది సన్నని నడుము పోను పోను వెడల్పైన భుజాలకు బరువైన వక్షస్థలం. శ్రద్ధతో చెక్కిన అందమైన శిల్పంలాంటి ముఖవర్చస్సు. మెడ భాగాన్ని కప్పివుంచె వొదులైన కొప్పు. పాతికేళ్ళ పడుచుదనం పోతపోసుకుని చామనచాయలో ఆకర్షణను అద్దుకొన్న విగ్రహం.

**

ఇంట్లోని సామానంతా మూడు రిక్షాల్లో నింపి చేతులు దులుపుకుంటూ వొచ్చి యింటి ముందు నిలుచుంది.

అంతకంటె ముందె సామానులను సర్దుతున్న ఆమెను, ఎస్తూ పోతూ చూస్తూ కొంత దూరంలో అందరూ గుస గుసలాడుతూ నిల్చున్నారు.

సాలిని పెదవులపై నవ్వును పులుముకుంటూ అందర్నీ రమ్మన్నట్లు సైగ చేసింది. ఆడ, మగ, చిన్న పెద్ద అందరూ వచ్చి చుట్టూ చేరారు.

"ఇల్లు ఖాళీ చేశాను. అందర్కి నమస్కారాలు. ఈ బస్తీ వాళ్ళు నన్ను మంచిగనే చూశారు. ఈమధ్యనే ఎందుకో నా మీద కోపం వచ్చింది." రొండిన చెక్కివుంచిన కొంగును వొదులుతూ అంది.

అందరూ చూస్తూ నిలుచున్నారు తప్ప ఎవ్వరూ ఏం మాట్లాడ లేదు.

"అందర్కి బాగ బతకాలనె వుంటుంది. కాని బతకలేక పోతున్నాం. ఉద్యోగం చెయ్యాలని వుంది. అది అంత సులభంగా దొరకదే! యింకేది చెయ్యాలన్నా రక్షణ లేదు. పుట్టింది పల్లెటూరు. నాన్న చిన్నప్పుడే పోయాడు. అన్నలు, తమ్ములు ఎవరు లేరు, ఒక్క అమ్మ తప్ప. ఆమె ఊరు వదలదు. ఊళ్ళో నాకు బ్రతికే అవకాశం

లేదు. పెళ్ళి సంబంధాలొస్తున్నా, ఏమీ యివ్వలేమని తెలుసుకున్నాక మాట్లాడకుండా వొచ్చినదారి పడుతూ వున్నారు.

ఓ స్నేహితురాలి సహాయంతో ఈ పట్టణం వొచ్చాను. అప్పటివరకు "సాలమ్మ" అని వున్న నా పేరును "శాలిని"గ మార్చింది ఆమె.

స్త్రీకి మిగిలింది ఏమిటి తనవాళ్ళు, ఒంటరిగవున్న స్త్రీని ఎన్ని కందిరీగలు కరవచూస్తయి. ఎన్ని పిచ్చికుక్కలు కాటెయ్య చూస్తయి. అన్నిటినీ తప్పించ్చుకుంటూ నడవాలి. నేను రాజేష్‌ను ఉర్కెనే తిట్టలేదు. ఈమధ్య అతను నేను స్నానం చేసేటప్పుడు వేప పుల్లల కోసం చెట్టెక్కేవాడు. మా బాత్‌రూంకు కప్పు లేదు. ఇక గోపాల్, రాత్రిపూట జనం రాకపోకలు ఆగిపోయినాక వొచ్చి కిటికీ గుండా చూసేవాడు. అందుకని వాళ్ళను మందలించానే తప్ప ఆహంకారంతో తిట్ట లేదు.

పెళ్ళి కాకుండా వున్నందుకు అందర్కి లోకువే. రోజూ ఎన్నో అవమానాలు మరెన్నో అనర్థాలు. ఓ పెద్ద మనిషి వుంపుడుగత్తెగ వుండమంటాడు. మరొక ప్రబుద్ధుడు రెండవ పెళ్ళాంగ చేసుకుంటానంటాడు. రెండవ పెళ్ళానిగనైతే కట్నం లేకున్న పర్వలేదట. ఉంపుడుగత్తెగ

నైతే ఎదురిస్తా నంటాడు. యిది మన వివాహ వ్యవస్థ వ్యాపార సంస్కృతి ! "శాలిని" గ నా పేరు సార్థకం అవుతుందనే ఆశ రోజు రోజుకు సన్నగిల్లసాగింది. అందువల్ల నా పేరును మరొకసారి "సాలిని"గ సరిచేసుకోవడం జరిగింది.

నేను రోజు పొద్దుటే వెళ్ళి పొద్దుగూకేవరకు ఆర్ట్స్ కాలేజిలో మోడల్‌గ పనిచేస్తున్నానే తప్ప వొళ్ళు అమ్ముకోలేదు. అక్కడ శృంగార భంగిమల చిత్రాలు గీస్తారు. అంతే.

మీరన్నట్లు రోజుకొకరితో వచ్చేదీ నిజమే. నన్ను ఆరోజు మోడల్‌గ ఎంచుకున్న వ్యక్తిస్థాయిని బట్టి దిగబెడుతూ వుంటారు" అంటూ అప్పుడే వొచ్చి సైకిల్ దిగి ఏదో చెప్పబోయిన వ్యక్తితో 'ఏం రంగన్నా యిలా వచ్చావు?'

"వారం రోజుల నుండి తమరు రాకపోయేసరికి పిలుచుకు రమ్మని పంపించిన్రు." అంటూ ఓ చేత్తో సైకిల్ పట్టుకుని మరో చేత్తో తలపై టోపీ సరిచేసుకున్నాడు.

అతను వేసుకున్న కాకిచొక్కా జేబు పైన "హెూంఫర్ ఓల్డ్ ఏజ్" అని ఎర్రదారంతో ఎంబ్రాయిడరీ చేసివుంది.

"అలాగా? ఇల్లు ఖాళీ చెయ్యవలసి వస్తే మరో ఇల్లు

వెదకటంలో రాలేకపోయాను. అందరు బాగున్నారు కదా?'' ఆప్యాయంగా అడిగింది.

''ఉన్నారు కాని మహాలక్ష్మమ్మ చనిపోయింది. మగవాళ్ళల్లో రంగారావూ పోయాడు. జానకమ్మ రేపో మాపో'' విచారంగా చెప్పాడు.

ఆమె కళ్ళల్లో నీరు వూరింది. రెండు క్షణాల మౌనం. ఆమె ముక్కు పుటలను కదిలించింది. ''డాక్టర్ రావటం లేదా? వేళకు మందులు వేసుకోవడం లేదా?'' ఆందోళనగా అడిగింది.

''మీరు లేకుంటే ఆ వేం ముసలాళ్ళు ఎవరికీ వినరు. పొద్దుగూకి ఏడుకాగానే మీకోసం ఎదురు చూస్తూ వుంటారు.''

''ఈరోజు తప్పక వస్తా పద'' అంటూ అందరివైపు మళ్ళీ చేతులు జోడించి వెళ్తానన్నట్టు తలాడించి రిక్షాలో కూర్చుంది. రిక్షాలు కదిలాయి. వాటి వెనకాలే రంగన్న సైకిల్.

అందరూ చూస్తూ నిల్చున్నారు ఎవరినోటా మాటరాలేదు.

1993

# మరమరాలు

"మళ్లీ ఎళ్లిపోయింది" అంటూ పేపర్ చదువుతూ కూర్చున్న రాములు ముందుకొచ్చి నిలుచున్నాడు సోమయ్య. నోటమాట రాక సోమయ్య వైపు చూస్తుండి పోయాడు రాములు.

"పేదోళ్ళకు రోగాలు వుట్టిగనే వొస్తయి గాని వుట్టిగనే పోవు. పానాన్ని తీసుకునే పోతయి" అంటున్నప్పుడు సోమయ్య కనుకొలకులు తడి అయినయి.

"దావకానాకు తీసుకు పోలేదా ?" పేపరును మడిచి ప్రక్కన పెడుతూ అడిగాడు.

"తీస్కపోతే ఏముంది, అక్కడ పైసలు లేంది మొకం జూస్తరా? పోతందుకు బాట కర్సులు లేవాయె, యిక్కన్నే ఆడాడా అడుక్కొచ్చి సూదులు యిప్పిస్తే తగ్గదాయె"

"మొగనికి చెప్పంపలేదా?"

"ఆడేమొస్తడు, పొద్దంత చేసి రాత్రంత తాగుతడట. ఆనికి పెండ్లం వుందన్న జాసే లేనట్టుంది. యిగ సావుకా ఆడు అందడు. రాత్రి సచ్చిన మనిషి అప్పుడే ఆసన లేసింది. దాని అక్క దగ్గర్కి తెల్లొరగట్ల మనిషిని పంపినం ఆల్లు రాంగనే."

"సరే" అంటూ లేచి నిలుచున్నాడు రాములు. మల్లి యిక కనపడదు అని గుర్తొచ్చే సరికి ఎదలో ఏదో బాధ సుడిగాలిలా కదిలి కనురెప్పల మధ్యన కన్నీటి తెరలను పరిచింది.

"యింట్ల సిల్లిగవ్వ లేదు, అత్త ముసిల్ది ఏడుస్తూ కూసుంది. దాంతోటే తలగోరు పెట్టియ్యాలె. వున్నొక్కపిల్ల చిన్న పిల్ల. సరె ఎవరో ఒకరు పెడ్తరు గాని సావు కర్సు నీవు పెట్టుకో" అన్నప్పుడు రాములు ఏం మాట్లాడ లేక సోమయ్యనే చూస్తున్నాడు.

పక్క జిల్లాలో పంతులు పనిచేస్తున్న రాములు చాలా రోజుల తర్వాత తన ఊరొచ్చాడు. రెండు రోజుల తర్వాత

తన భార్య పిల్లలూ వస్తారు. అందరూ కలిసి ఓ వారం రోజులు గడిపి వెళ్ళాలని ఆయన ఉద్దేశం. చావు ఖర్చులు పెట్టే స్తోమత వున్నా తానే ఎందుకు పెట్టాలో, సోమయ్యే తననే ఎందుకు అడుగుతున్నాడోఅర్థం కాలేదు.

"నేను అన్ని ఆలోచించే సెపుతున్న. రావలసినోనివి పిలిచినట్టే వొచ్చినవు. సావుకర్సు నీవు పెట్టుకోవల్సిందే. నీవె ఎందుకు పెట్టుకోవాల్నో నీకెరక నాకెరుక, అదైతే లేదుగదా ?" అంటు రాములు కళ్ళలో చూశాడు.

"నీవెందు కంటున్నావో నాకర్థం కావటం లేదు!" నేలను చూస్తు అన్నాడు.

"నేను అర్థముండ బట్టికనే సెప్పిన. నేను పోయి పాడె కట్టిస్తుంటా రా" అంటూ సోమయ్య అక్కడి నుండి కదిలాడు, తప్పదు అన్నట్లు చూస్తూ. నలభై ఐదేళ్ళ సోమయ్యకు పేదరికం పెట్టిన బాధల వల్ల బక్కచిక్కిన కాళ్ళకు చేతులకు నరాలు దేలినా సత్తువ తోటే నడుస్తున్నాడు.

రాములు ఆలోచనల్లో చిక్కుకుని సోమయ్య వెళ్ళిన వైపే చూస్తున్నాడు. కొంత సేపటికి సోమయ్య కనపడకుండా పోయి మళ్లి కళ్ళముందు కొచ్చింది.

"తాను బియిడి వుుగించుకుని శెలవుల్లో

ఊరొచ్చినప్పుడు ఆమె ఈ ఊరికి కోడలుగా వచ్చింది. తన యిల్లున్న వాడలోనే ఆమె ఇల్లు కూడా. రోజూ పొద్దున్నే నీళ్ళుతోడు కోవడానికి తన యింటి ముందున్న బావి మీదికి వస్తూ వుండేది. కాయ కష్టం చేయడం వల్ల శరీర అవయవాలు పడుచుదనం పరువంలో సమపాళ్ళల్లో ఎదిగి కళ్ళల్లో ఆకర్షణ, చూపుల్లో చురుకుదనం తొణికిసలాడేది ఆమెను చూసిన వాళ్ళల్లో ఏవేవో తలంపులని వాళ్ళ వాళ్ళ చూపులే చేప్పేవి. సీ అండ్ ఎంజాయ్ అనే కాలేజీ స్లోగన్ మాటి మాటికీ గుర్తొచ్చి తనకు నవ్వోస్తూ వుండేది. అందమున్న వైపు ఆకర్షించ బడడం కళ్ళకున్న సహజ గుణమైతే, మంచి చెడులను ఆలోచించేది మనస్సు లక్షణం కదా. మగనాలి, చూసి వూర్కోవడం తప్ప మరో ఆలోచనకు దారి వుండ కూడదు కదా.

పట్టణాల్లోని కళాశాలల్లో అమ్మాయిలంతా అందంగా అలంకరించుకొని నాజూగ్గా తిరుగుతూ వుంటే కొంటె చూపులు తుంటరి మాటలు విసురుకోవడం జరుగుతూ వుంటాయి. కాని పల్లెల్లో అలా కాదు. మాటకు మాట, నడిచినా నిలుచున్నా ఓమాదిరి స్థిరత్వం. మనస్సును కదిలించే సరసం మట్టెల చప్పుళ్ళతో, గాజుల సందడితో

మలిసం లేని నవ్వులతో తిరుగుతారని రెండు రకాల జీవితాలను పరిశీలించినాక తెలిసొచ్చిన నిజాలు. తిరునాళ్ళలో తిరగడం, పండుగల్లో సంబర పడడం, పెళ్ళిళ్ళలో ఒక ఊరి నుండి మరో ఊరికి వెళ్లడం లాంటివి మనుషులను దగ్గరకు చేరుస్తాయని, వరుసలతో పిలుచుకునే మాయ మర్మం లేని మాటలు ఎంతో ఆనంద పరుస్తాయని అనుభవ పూర్వకంగా తెలిసొచ్చింది.

మల్లి పరిచయం తనను మరింత ఉల్లాస పరిచింది. ఆమె చూసినా నవ్వినా మాట్లాడినా మనస్సు విప్పుకొనేది.

అప్పుడప్పుడు చేద బావి దగ్గరో, చెర్వు కట్ట మీదనో కలిసినపుడు, మౌనంగా నవ్వుకోవడం ఊర్లో కొందరికి, ముఖ్యంగా ఆమె అత్తగారి వాళ్ళకు అనుమానం వచ్చింది. అది పెరిగి అనర్థపు ఆలోచనగా మారి ఈ అక్రమ సంబంధం ఆగిపోవాలంటే యిద్దరిలో ఒకరు అయిపోవల్సిందే అన్న నిర్ణయానికొచ్చి ఆమె మరుదులు, బావలు కాపలా కాశారు. అనుకున్న స్థలానికి అనుకున్న వాళ్ళు రావడం లేదని మల్లిని చంపితే, రెక్కాడితే కాని డొక్కాడని మల్లి సంసారం ఉన్నా లేకున్నా భార్య భర్తల రోజు కూలితో దినం గడిచేది. మళ్ళీ పెళ్ళి ఓ సమస్య కనుక మందలించి వూర్కున్నారు. మరిగిన జీవి తప్పక

చిక్కుతుందని, హత్య చేయాలన్న ఆలోచనలను వాయిదా వేసుకుంటూ వచ్చారు.

**

డప్పుల చప్పుడు చావును చాటుతున్నాయి. రాములు మనస్సు అదో మాదిరిగా వుంది. ఏదో తప్పు చేసిన వాడిలా అటూ ఇటూ తిరుగుతున్నాడు. మల్లి చచ్చిపోయిందీ. ఆ నవ్వూ, ఆ నడకా, ఆ చూపులు వయస్సుతో పాటు పెరుగుతూ సంతరించుకున్న సహజమైన అందం-చందం ఎక్కడికి పోతుంది? కాకపోతే పేదరికం వల్ల కొంత తగ్గినట్లు కనిపించవచ్చు. చచ్చినాక మల్లి ఎలా వుంటుందో వూహించలేక పోయాడు. వెంటనే వెళ్ళి చూడాలని వాళ్ళ యింటి వైపు నడిచాడు. డప్పుల చప్పుడు ఎక్కువైంది. వాకిలి నిండా జనం నిలుచుని ఏవేవో మాట్లాడుతున్నారు. ఆమె ముదుసలి అత్త ముంత పట్టుకుని ముందు నడుస్తుంది. ఆమె ముడుతలు పడ్డ ముఖంలో కాలం గీసిన బాధల గుర్తులు. దుఃఖాన్ని యింకించుకున్న కళ్ళు పీక్కుపోయినయి. కొడుకును మరిచి పోయిన ఆమె మనస్సు కోడలు కోసం తన్ను కుంటోంది. తన భర్త పోయిన రోజు గుర్తొచ్చినట్టుంది. మధ్య మధ్య నిట్టూర్పులు తన్నుకొస్తున్నయి. పాడెను

పట్టిన వాళ్ళు కదిలారు. పాడె వెంట ముందు వెనుక జనం. ముత్తైదువగా పోయిన మల్లికి పసుపు కుంకుమ పూశారు. కొన్ని బంతిపూలు వేశారు. ముఖం కనిపించేటట్టు వుంచి నిలువెల్ల తెల్లగుడ్డని కప్పారు. రాములు వడివడిగా నడిచి జనంలో కలిసి పాడె ప్రక్కగా నడుస్తున్నాడు. రాములు రాకను చూసిన కొందరు గుసగుస లాడుకుంటున్నట్లనిపించింది. ఆడవాళ్ళల్లో కొందరు కంట నీరు పెడుతూ ముక్కు చీదుతూ వుంటే మగవాళ్ళు మౌనంగా నడుస్తున్నారు. మరికొందరు మధ్య మధ్యన డప్పు వాళ్ళను ఆపి దరువు వేయిస్తూ, ఆడుతూ వున్నారు. బాగా తాగిన సోమయ్యా పాడె వెనకాల నడుస్తూ వొళ్ళోవున్న చిల్లర నాణేలను మరమరాలను శవంపై చల్లుతూ వుంటే కొందరు పిల్లలు ఆ నాణేలను ఏరుకుంటున్నారు. శవయాత్ర చూసేసరికి చెప్పలేని బాధ రాములు వంటిని చుట్టేయగా, వేసే అడుగుల్లో సత్తువ తగ్గింది. అయినా నలుగురితో కలిసి నడుస్తూ రకరకాలుగా ఆలోచిస్తున్నాడు. చావు ఖర్చు యివ్వలేనందుకు మనస్సు చివుక్కుమంది. పైసలను చల్లుతున్న సోమయ్యాను చూస్తుంటే రాములికి సిగ్గనిపించింది. వీలైనంతవరకు అతని కంట పడకుండా

నడుస్తున్నాడు. దింపుడు కళ్ళం దగ్గర శవాన్ని దింపి గాజులు, మట్టెలు తీసేశారు.

ఆ తరువాత శవాన్ని బొందవైపు మోసుకెళ్ళారు. రాములు పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ, యిక ఆమెను మట్టిలో పెట్టడం చూడలేనని యింటివైపు నడిచాడు. వొంటరిగా నడుస్తున్న రాములు కళ్ళముందు గతం కదలాడింది.

**

ఒకరోజు యింట్లోవున్న వేప చెట్టు కింద కూర్చొని గడ్డం గీసుకుంటున్నాడు రాములు. పక్కింటి బాలమ్మ బయట దర్వాజ దాటి లోపలికొస్తూ "మీ వదిన మీ అన్నకు బువ్వ కొంచబోయినట్లుంది."

"ఆ"

కొప్పును విప్పుకొని వెంట్రుకల చిక్కును సరిజేసుకుంటూ 'సదువు అయిపోయెగ? యిగ పెండ్లి చేసుకోరాదు?' అంటూ రాములు చేతిలోని అద్దాన్ని తీసుకుని అందులో తన ముఖాన్ని చూసుకుంటు ఓసారి పాపిడను సరిచేసుకుంది.

"నౌకరి రానీ వొదినా" అంటూ షేవింగ్ బాక్సును సర్ది పక్కకు పెట్టాడు.

"నౌకరొచ్చే వరకు నారాయణ జపమేనా?" అంటూ అద్దాన్ని అతని చేతిలో పెట్టింది.

తప్పదు అన్నట్లు చూశాడు అద్దంలో తన ప్రతిబింబం వైపు. "అద్దం మనసును చూపియ్యకున్న వయస్సును సూపిస్తది సుమా" అని ఆమె అన్నప్పుడు, అవును అన్నట్టు తల ఆడించాడు.

"పార్లిపారే వాగు, పోయే వయస్సు వెనక్కి రావట" అంది మళ్ళీ తానే. రాములు ముసిముసిగ నవ్వుతూ బాలమ్మ వైపు చూశాడు.

"పొలం పనులు తప్ప మీ అన్న నీ గురించి పట్టించుకోడాయె, మీ వదినన్న సెప్పదాయె" అని బాలమ్మ అన్నప్పుడు రాములుకు తల్లి, తండ్రి గుర్తొచ్చారు. ముఖంలో ఏదో కొరత కొట్టొచ్చినట్లు కనిపించింది.

"దాని గురించేనా ఆలోచన?"

"దేని గురించి?" చేతిలోని అద్దాన్ని షేవింగ్ బాక్సు మీదుంచుతూ అడిగాడు.

"అదే రోజు తానానికి నీళ్ళు తోడిపెట్టేది.'

"ఆమె గురించా? అదేం లేదే"

'ఓహోనే కనిపెడ్తనే వున్నతే" అంటు తల వెంట్రుకలను ఒక్క దగ్గర్కి చేర్చ

కొప్పేసుకుంటున్నప్పుడు, చేతులు వెనక్కు వెళ్ళడం వల్ల ఆమె ఎత్తయిన ఎద అతలాకుతలంగా కదిలింది.

నలభై దాటిన బాలమ్మ ఏం చదవక పోయినా మనుషులను వాళ్ళు చేసే మాయల్ని చూసింది. పురాణ కథల్ని వింటూ వాటిల్లో నీతి పేరిట జరిపే తంతులను తెలుసుకుంది. అందుకే ఆమె మాటల్లోనూ చేతల్లోనూ తెగింపు కనిపిస్తుంది.

"అవును పేరుకు తగ్గ మనిషివే కాని వొట్టి చూపులతో మాటలతో మందిని పిచ్చోళ్ళుగా సెయ్యొద్దు సుమా"

రాములు ఏదో చెప్పబోయే సరికి ఆగు అన్నట్లు చేత్తో సైగ చేసి మరింత దగ్గరకు చేరి 'కోరికలు రేగడానికి మాటలు, చూపులు మంత్రాలు పిలగ, నీవంటె అది పడి సస్తది' అని సాగదీస్తూ తన రెండు చేతులను తొడల మధ్య వుంచి శరీరాన్ని వోమాదిరిగా వొంచి వొదులుతూ అంది.

"నేను అట్లేమి కాదు" అంటూ లేచి నిలుచున్నాడు.

"కాకుంటె మానాయె ఊరంత కోడై కూస్తుంది. ఏం చెయ్యకుంట ఎందుకా బదునాం" అతని కళ్ళల్లోకి చూస్తూ అంది.

"దానికి నేనేం చెయ్యను?" తల వంచుకుని అన్నాడు.

"ఏం లేదు నేను దాన్ని పిలుస్తా కలువు - ఆ తరువాత ఒకరిమీద ఒకరికున్న మరులు తగ్గితయి".

"నీతో చెప్పిందా?"

"సెప్పాల్నా సూస్తుంటే తెల్వదా? అయినా ఆడది నోరు తెర్సి అడ్గుతదా?"

"భర్త వున్నాక"

"అయ్యో రామ, ఐదుగురున్నంక ద్రౌపతి ఆరోగని మీద మనస్సు పెట్టిందని యిననే లేదా?" ఓసారి కుడి చేతిని నోరుపై వుంచి తీసింది.

"అవి కథలు"

"వొట్టి కతలు గావు" తలను అడ్డంగా ఆడిస్తూ అంది.

"మరి?" అంటూ ఆమె వైపు ఆసక్తిగా చూశాడు.

"లంజకతలు" అంటూ ఓకన్ను మూసి తెరిచింది.

ఈసారి రాములుకు నవ్వాగలేదు.

"సెంద్రక్కా నీళ్ళబొక్కె నిస్తావా" అంటూ బయటి దర్వాజాను పట్టుకుని ఇంట్లోకి తొంగి చూసింది మల్లి.

"ఇక్కడి నుండి తప్పుకో కాసేపు" అని ఎడమ చేత్తో రాములుకు సైగ చేసి.......

"యిస్తా... రా రా" అంటూ కుడి చేతితో సైగ చేసింది. బాలమ్మ అందరితో కలగలుపుగా మాట్లాడడం వల్ల

అందరూ ఆమెతో సరదగా చనువుగా వుంటారు. ఆమె మొదటి మొగుణ్ణి వొదిలి ఈవూరికి రెండవ మనువు వచ్చింది. ఈమె ఎంత మాటకారో ఆమె మొగుడు అందుకు వ్యతిరేకం. అతను ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడడు. తన పనేదో తాను. అంతేగాదు బాలమ్మను అదుపులో పెట్టే ప్రయత్నం చెయ్యడు. అందుకని బాలమ్మ మాటలు అందర్నీ నవ్విస్తూ వుంటాయి. కవ్విస్తూ వుంటాయి.

సెంద్రక్క వున్నదనుకునొస్తె బాలక్క వుంది. వొంటరిగ కలిస్తె ఏదో ఒకొంటె మాటంటది. ఏమి అనసుందో అనుకుంటూకింది పెదవిని పంటి కింద అదిమి వుంచి, నవ్వు ముఖంతో లోపలికి వచ్చింది మల్లి.

"నవ్వులు నాకాయి, చూపులు ఎవ్వరినో ఎతుకుతున్నాయి". అంటూ మల్లి ముఖాన్ని చేతుల్లో తీసుకుని బుగ్గలను అదిమి వొదిలింది. ఏదో సిగ్గు బుగ్గల మీద ఎరుపై పూసింది.

'వొట్టి చూపులతో ఎన్నాళ్ళు? అంటూ ఆమె చేతులు పట్టుకుని యింటి వెనక వైపు తీసుకెళ్ళి –

"సూడు రాములు నీమీద మనసు పెట్టిండు" అంది.

నేలను కాలి బొటన వ్రేలితో రాస్తూ, ఆ వేలునే చూస్తూ

నిలుచుంది మల్లి.

"పిలుస్తా" భుజం మీద చేయి వేస్తూ.

"వొద్దు" కళ్ళు పెద్దవి చేసి గుండెల మీద చేతులను వేసుకుంటూ అంది.

"ఎందుకొద్దు?" సూటిగా కళ్ళల్లోకి చేస్తూ.

కాని పని అన్నట్లు తల అడ్డంగా ఊపింది.

"అదే"

"మా అక్కా బావా పెంచి పెండ్లి చేసిన్రు. అత్తగారింటికి సాగనంపుతూ మా అక్క కంట నీరు పెట్టుకుని మనం దిక్కులేనోళ్ళం. మన మంచే మనకు దిక్కు. కన్నింటికి కొన్నింటికి మంచి పేరు తేవాలి పేదరికంతో చచ్చినా సంతోషిస్తా కాని చెడ్డ పేరు తేవద్దు" అంది.

కంటనీరు నింపుకున్న మల్లిని వొదిలి బాలమ్మ సిగ్గుతో తల వంచుకుని నిలుచుంది. మల్లి చేద బొక్కెనతో బయటికి నడిచింది. రాములు రోజులా చేదబావి మీదికి పోకుండా వూరిపక్కనే వున్న వ్యవసాయ బావి వైపు నడిచాడు.

రాములుకు బాలమ్మ మీద కోపమూ, మల్లి మీద గౌరవమూ పుట్టుకొచ్చాయి.

'బొంద పెట్టిన్రా?' ఎదురొస్తూ అడిగింది బాలమ్మ.

బాలమ్మ వెనకటి తనతో మాట్లాడినట్లుగా లేదు. సగం కంటె ఎక్కువగా తల నెరిసింది. మనిషి కూడా దిగిపోయి, వయసుతో పాటు వచ్చిన మార్పు కొట్టొచ్చినట్లుగా కనిపిస్తోంది.

"ఆ"

"బతకమ్మ లాంటి మనిషి మట్టిపాలై పాయె చేసుకున్నోడు సక్కంగ సాదుకుంటె, యింత తొందర సావకపోవు"

రాములు మౌనంగా నిలుచున్నాడు.

"మొగుడు సావు కందడని ఆ సోమయ్యే అదో ఇదో సేసి సావుకర్సు ఆదుకుండటగ".

"అట్లనా?" అన్నట్లు చూశాడు రాములు.

"ఆమాత్రం సెయ్యడా అంటున్రు".

"అంటే" రాములు ఆశ్చర్యంగా.

"ఆడు దానికి అలవాటట" అని గొంతు తగ్గించి అంటూ కొంగును నెత్తి చుట్టూ కప్పుకుంది ఎండ తగలకుండా.

"ఆమె అలాంటిది కాదని మనకు తెలుసు కదా?".

"తిని కుడిచేదాన్ని వొదిలి పోయినా, పైసా పంపకున్నా

నెలల కొద్దీ రాకపోయినా మొగరాయుడొలె కష్టం చేసి అత్తను అడక్క తినకుండా సాదిందనుకో".

"ఆమె తప్పు చేసిందంటే నేను నమ్మను".

"నేనూ నమ్మను కాని లోకుతే గుసుగుస".

సోమయ్య చావు ఖర్చు ఎందుకడిగిండో యిప్పుడర్థమయ్యింది. ఒకవేళ తానూ యిస్తే...

"నేనందాక పోయొస్తా" అంటూ ఆమె బొందల వైపు, రాములు యింటి వైపు నడిచారు.

తోవ పొడుగునా సోమయ్య చల్లిన స్వచ్ఛమైన మరమరాలు కాకుల్లాంటి లోకుల కాళ్ళకింద నలిగి మనిషికీ మనిషికీ మధ్యన వున్న సంబంధాలను గూర్చి ప్రశ్నిస్తున్నట్లు అనిపించింది రాములుకు.

# కొకమ్మ కథా ?!

అది జిల్లా హెడ్‌క్వార్టర్స్. అందువల్ల అన్ని డిపార్ట్‌మెంట్స్ కార్యాలయ భవనాలు అక్కడే వున్నాయి. నాలుగు ఆటలు నడిపే సినిమా హాళ్ళతో, ఎప్పుడూ ఏదో తినడానికి తాగడానికి సిద్ధంగా వుంచే హొటళ్ళతో, బార్లతో పట్టణమంతా పొద్దున లేస్తే సందడే సందడి. గడియారాల్లోని సెకన్లముల్లు వేగంగా కదిలినట్లు, జనం ఎవరి పని మీద వాళ్ళు.

మెయిన్ రోడ్డెమ్మటి ఆ పట్టణంలోని మురికినంతా నెట్టుకు పోయె పెద్ద కాలవ. ఆ కాలవ రెండు వొడ్డులను కలపడానికి అక్కడక్కడ వంతెనలు. నిర్మాణంలో వున్న

మరొక వంతెన కోసం రోడ్డు ప్రక్కమ్మటే వుంచిన సిమెంట్ పైపులు అనాధలకు ఆశ్రయాలు. వాళ్ళలో పుల్లయ్య ఒకడు.

బాల్యమంతా ఎలా గడిచింది చెప్పడు. యవ్వనంలో ఏం చేసింది చెప్పడు. చేతనైనన్ని రోజులు చేసుకొని బతికి, వృద్ధాప్యం నడుం వంచగ తొంభై సంవత్సరాలు నిండినా యింకా చావు తన దగ్గరికి రాదాయె అని అప్పుడప్పుడు బాధ పడుతూ వుంటాడు పుల్లయ్య. సన్నగా, పొడుగ్గా, పాత నీళ్ళకుండ రంగులో, సీసపు గోలీల్లాంటి కనుగుడ్లతో, సంకలో జోలె, చేతిలో కర్ర, చిరిగిన గుడ్డలతో, అదో మాదిరిగా యిండ్ల ముందుకెళ్ళి నిలుచుంటాడు. ఓ కుక్క పొద్దంతా వెంట తిరిగి రాత్రి అతని పక్కనే పడుకుంటుంది. అడుక్కున్నది తనకు కొంత కుక్కకు కొంత. అది అతనిలాగే పెడితే తింటుంది లేక పోతె అలాగే పడుకుంటుంది, కాని దేనిని ముట్టదు.

ఆ రోజు మధ్యాహ్నం బడి పిల్లలు తిండికొచ్చి తిరిగి వెళ్ళే వేళ, అడుక్కొచ్చుకున్న అన్నాన్ని కొంత కుక్కకు పెట్టి తను కొంత తినాలని మూట విప్పి కూర్చున్నాడు పైప్‌లో. పక్కనే వేప చెట్టు మీద వుండే కాకులు వచ్చి అక్కడ రాలే మెతుకులను తినడానికి వాలుతూ వుంటే, కుక్క వాటిని మధ్య మధ్యన కసురుతూ వుంది. వొస్తూ

పోతూ స్కూల్ విద్యార్థులు మెతుకుల కోసం వాటి పోటిని వింతగా చూస్తూ వుంటారు. అంతేకాదు చిన్న చిన్న రాళ్ళను తీసుకొని కాకులకు తగిలేలా విసురుతూ వుంటారు. ఆ రోజు స్కూల్‌కు వెళ్ళే వాళ్ళలో నుండి ఒకడు తన పుస్తకాల సంచిని వీపుకు అదిమి పట్టి, వంగి చిన్న రాయిసందుకొని గురి చూసి విసిరాడు. ఓ కాకి మెడను విరుచుకొని పడి రెక్కలను రెప రెప కొట్టుకొని దీనమ్మైన శబ్దం చేసింది. తాను విసిరిన రాయి తగిలిసందుకు సంతోషంగా చూస్తూ ముందు వెడుతున్న తన మిత్రులను ఆగమని కేక వేశాడు. కాకి ఆర్తనాదాన్ని విన్న పక్కనున్న చెట్టు మీద కాకులన్ని ఒక్కసారే గుంపుగా తరలి వచ్చి దెబ్బతిన్న కాకి చుట్టూర తిరిగి చూసి, నవ్వుతూ నిలుచున్న కుర్రవాని చుట్టూ మూగి తన్నసాగినవి. అనుకోని కాకులదాడికి బెదిరి పోతూ కుర్రవాడు వేగంగా పరుగెత్తి మిగతా విద్యార్థులను కలిసినా ఫలితం లేకపోయింది. అవి వెంటాడుతూనే వున్నవి. కుర్రాడు వేగంగా పరుగెత్తి పక్కనే వున్న స్కూల్ రూమ్‌లో దూరాడు. సిమెంట్ పైప్‌లో కూర్చొని చూస్తున్న పుల్లయ్య పెదాల మీద ఆలోచనలను వెదజల్లే నవ్వు కదిలింది.

"ఈ కాకులు...!" అంటూ నిన్న జరిగిన సంఘటన గుర్తు రాగానే అతని ముఖంలో ఓ మాదిరి ఈసడింపుతో

కూడిన విరక్తి భావం మెరిసింది. అటు యిటు కదిలి కూర్చొని చూపును దెబ్బతిన్న కాకి మీద నిలిపి నిన్నటి సంఘటనను తలచుకోసాగాడు.

**

ఉదయం కార్యాలయాలు మొదలయ్యే వేళ, దుకాణాలు తెరవడం వల్లరోడ్లన్ని రద్దీగా వున్నాయి. ఓ బస్సు కోర్టు ముందు చౌరస్తాలో కొచ్చి ఆగగానే కొందరు దిగుతున్నారు. మరికొందరు ఎక్కడానికి సిద్ధంగా పక్కకు నిలుచొని దిగేవాళ్లని చూస్తున్నారు.

రెప్ప పాటులో కలవరం మొదలయ్యింది.

ఎవరు ఎక్కేది ఎవరు దిగేది తెలియని పరిస్థితి.

ఓ దిగుతున్న వ్యక్తి కడుపులో పిడి బాకు దిగగానే క్తం పక్కమ్మటి నిలుచున్న జనం మీద చిమ్మింది.

అంతే - ఓ చావు కేక !

మరొక గొడ్డలి వేటు !

అతను మొదలు నరికిన చెట్టులా నేలకూలాడు.

హంతకులు కసి తీర్చుకొన్న చూపులతో వెళ్ళిపోయారు.

మనిషి మనిషినే వేట !

తప్పు తనది మాత్రం కాదు అన్నట్టు బస్సు కదలి పోయింది.

ఆ ప్రాంతమంతా భయంతో గూడు కట్టుకొంది. ఎవడు హంతకుడోఎవడు అమాయకుడో తెలియని అయోమయ పరిస్థితి అక్కడ చోటు చేసుకుంది. ఒకరితో ఒకరు మాట్లాడటం మానేసి ఎవరి దారిన వాళ్ళు మౌనంగా పరుగు పరుగున పరారవుతున్నారు. కొద్ది దూరంలో వున్న పోలీసు, ట్రాఫిక్ కంట్రోల్ కోసం విజిల్ వూదుతున్నాడే తప్ప ఈ విషయాన్ని పట్టించుకున్నట్టు లేదు. ఎదురుగా వున్న షాపు వాళ్ళు తమ దుకాణాల షట్టర్స్ గుంజేసారు. పక్కనే వున్న పాన్ షాప్ వాడు తన షాప్ మూసి సందులో పడ్డాడు.

రోడ్డు మీద రక్తం మడుగులో మనిషి తన్నుకొని తన్నుకొని ప్రాణం వదిలాడు. వకీళ్ళకార్లు ఆవరణలోకి మళ్ళుతున్నాయి. వాటి వెనకాలే జడ్జిగారి'కారు వెళ్ళింది. ఒక్క పరుగున కుక్క పరుగెత్తి హతుని చుట్టూ తిరిగి వచ్చి పుల్లయ్య ముందు కూర్చొని మూగగా ఏదో గునుస్తూ బెదిరి బెదిరి చూస్తు వుంది. అప్పుడు దాని కళ్ళు తడి అయినవి.

మనుషులు మాత్రం ఎవరూ పట్టిచ్చుకోకుండా ఎవరి దారిని వాళ్ళు వెళ్ళి పోతూనే వున్నారు. ఎంతో సేపటికి కాని పోలీసు జీపు అక్కడికి రాలేదు.

**

నిన్నటి అమానుష సన్నివేశాన్ని తట్టుకోలేక పుల్లయ్య ఓసారి కళ్ళు మూసి తెరిచాడు. రెప్పల కింద ఊరిన నీరు బయటికి వొలికాయి. అప్పుడతని తడికళ్ళకు మసకమసగ్గా కనిపించే కాకుల గుంపులోకి తన గుడ్డలోని అన్నాన్ని వెదజల్లాడు.

రోజూ కాకులను తరిమే కుక్క ఈ రోజు ఏమీ అనకుండా తన ముందలి కాళ్ళపై తల ఆనించి కాకులను చూస్తూ పడుకుంది.

1989



# అద్దం

రాజధానిలో అల్లర్లు, కర్ఫ్యూ. ప్రజాజీవితం స్థంభించి పోయిన దృష్ట్యా ప్రభుత్వం విఫలమైందని పత్రికల విమర్శ. నిరసనగా రాష్ట్రమంతటా బంద్. టర్నోవర్ టాక్స్ పెంచినందుకు వ్యాపారస్తుల పిలుపు. మరునాడు బంద్! తెల్లారి ఆదివారం !

మొదటి తారీకు నాటి నుండి, నాలుగో తారీకు వరకు దుకాణాలు తెరవలేదు. దుకాణాల్లో దుమ్ము, జన జీవనంలో యిబ్బంది పేరుక పోతుంది. చిన్న చిన్న వర్తకులకు రావలసిన బాకీలు పాత బాకీల పద్దుల్లోకి

చేరిపోతున్నవి. పెద్ద కొడుకు వసూళ్ళకు వెళ్లగా నారాయణ దుకాణం తెరచి కూర్చున్నాడు. గుమస్తా పిల్లవాడు తరాజును తుడుస్తూ వున్నాడు.

జనం అప్పుడప్పుడే వస్తున్నారు. కొందరు బాకీ బాపతు రూపాయిలు యిచ్చి సామానుకు సాయంత్రం వస్తామని చెప్పి వెడుతున్నారు. పదకొండు అయింది. రద్దీ బాగా పెరిగింది. వున్నట్టుండి దుకాణాల్లోని గుమస్తాలు పక్క దుకాణాల్లోకి పరుగులు, గుసగుసలు. కొందరు సేట్లు దుకాణాలు వదిలి పక్క కొట్లలోనికి వెడుతున్నారు. పక్క దుకాణపు గుమస్తా వచ్చి నారాయణ చెవిలో కూడా ఏదో చెప్పాడు. "సరే" అని తలవూపి తన పనిలో తాను మునిగిపోయాడు.

ఓ జీపు వచ్చి దుకాణం ముందు ఆగింది. ఇద్దరు దిగి ఎదురు దుకాణం లోకి ఒకరు, నారాయణ దుకాణంలోకి మరొకరు నడిచారు.

నారాయణ లేచి నిలుచోని నమస్కారం చెప్పాడు. ప్రతి నమస్కారం చేసినట్టు చేయి సైగచేసి "నేను ఎ.సి.టి.వో.ను. దుకాణాన్ని ఇన్‌స్పెక్షన్ చేయాలి" అంటూ చేతిలోని డైరీని ఫైల్ ప్యాడ్‌ను, గల్లా పెట్టె మీద వుంచాడు.

"మొన్న డి.సి.టి.ఓ.గారు" అన్నాడు నారాయణ

వినయంగా.

"మాది స్పెషల్ పార్టీ. లెక్కల పుస్తకం యిలా యివ్వు" అంటూ పక్కనే వున్న స్టూల్ మీద కూర్చున్నాడు. "ఏం స్పెషల్ పార్టో! ఏం మన్నో ! ఈ వ్యాపారం కంటే దొంగతనం చేసిందే మేలన్నట్టుంది" అంటూ లోలోపల గొణిగాడు.

"కిలో గోధుమ లివ్వండి" అంటూ ఓ కస్టమర్. జోకి యిచ్చాడు.

"గోధుమలన్నీ పుచ్చువా ?" కస్టమర్.

"మా పొలంలో పండినయి కావండి. గవర్నమెంట్ వాళ్ళిచ్చినవి" దొంగనుగూర్చిన ఆచూకి, పోలీసు వాళ్ళకు చెప్పినట్టు చెప్పాడు.

"రెండు కిలోల బియ్యం" ఓ స్త్రీ,

జోకి సంచిలో పోసిన బియ్యాన్ని చేతలోకి తీసుకొని చూసి, మళ్ళీ సంచిలోకి వదులుతూ "నూకలెక్కువ వున్నాయ్" అన్నది.

"బియ్యం గవర్నమెంట్ వాళ్ళిచ్చినవే, ధర వాళ్ళు నిర్ణయించిందే, మేము ఏమైనా జోకివ్వాల్సిందే ! వెనకట మేము స్వయంగా వ్యాపారం చేసేవాళ్ళం. మంచి సరుకులు - మంచి లాభాలు. ఇప్పుడు సర్కారు సరుకులు -

సర్కారు ధరలు ! మేము చేసేది ఆమాటే" అంటూ గుక్క తిప్పకుండా అనే సరికి ఆమె నోరు కదపకుండా రోడ్డెక్కింది.

"రెండు రిన్ సబ్బులు, ఓ లక్స్ యివ్వండి" అంటూ అలమారల వైపు చూస్తున్నాడు ఓ కాలేజి విద్యార్థి.

"లక్స్ సుప్రీమా ? మామూలిదా ?" నారాయణ.

"సుప్రీమంటే చాలా బాగుంటదా?" అడిగాడు కుర్రాడు.

"బాగుంటదా అంటే బాగుండదూ మరి. స్పెషల్ చాయ్‌కు సాదా చాయ్‌కు తేడా వుండదా ?"

"వుంటది"

"ఈ రెంటిలో కూడా అంతే తేడా" అంటూ వోసారి ఎ.సి.టి.వో. గారి వైపు చూసి "ఈ కంపెనీ వాళ్లు ధరలు పెంచాలనుకున్నప్పుడు వస్తువు రంగును మార్చడం, ఆకారం మార్చడం, అసలైన బరువును తగ్గించి సుప్రీం, స్పెషల్ లాంటివి తగిలించి రేటును పెంచేస్తే, వున్న మహారాజులు కొంటనే వుండిరి!"

విద్యార్థి నవ్వి "అయితే సాదా సబ్బే ఇవ్వండి".

సబ్బులను యిచ్చాడు గుమస్తా. విద్యార్థి జేబులో నుండి డబ్బు తీసి నారాయణకిస్తూ మరో వైపు –

"నాకు తెల్సులేవయ్యా నేను వ్యాపారశాస్త్రమే చదువుతున్నా. దేశాన్ని మంచేస్తుంద్రు!".

"ఎవరు ముంచుతుంద్రు? నాయకులు. వాళ్లెనుక

జండాలు పట్టుకొని జై కొడుతూ తిరగే మీరు ! వాళ్లను పెంచి పోషించేది బడా వ్యాపారులు కావచ్చు. మేము రోజు కూలీలం. నా మట్టుకు నేను ముప్పై ఏండ్ల నుండి ఈ వ్యాపారం చేస్తన్నా .సాహుకారిని కాలేదు ! సన్యాసిని కాలేదు".

"అందరూ ముంచుతూనే వున్నారు" అంటూ తన సైకిల్ కదిలించాడు విద్యార్థి.

అంతవరకు వాళ్ళ సంభాషణ వింటూ తన పని తాను చేసుకుంటున్న ఎ.సి.టి.వో.గారు "అవును ఆ అబ్బాయికి సబ్బుల బిల్ ఎందుకివ్వలేదు?"

"బిల్ యిచ్చేవరకాగిండా సార్? వుపన్యాసం యిచ్చుకుంటు పోతనే వుండే."

"పర్చేజ్ బిల్స్ అన్నీ జమా ఖర్చు చేసినట్లేనా ?"

"చేయకపోతే ఎలా కుదురుద్ది?"

"కుదిరేదీ కుదరందీ నాకు తెల్సు గాని, గోదాం చూద్దాం పదా".

'అరె పిలగ నేను వొచ్చేవరకు ఏదీ అమ్మకు" అంటూ గల్ల పెట్టెకు తాళం వేసుకొని యిద్దరూ గోదాం వైపు నడిచారు.

**

"ఈ పుస్తకంలో రాసిన వాటికి, యిక్కడ వున్న నిలవలకు లెక్క కలవడం లేదు".

"అయ్యా" అంటూ చేతులు కట్టుకొని నిలుచున్నాడు.

"ఏది కరెక్ట్ ! పుస్తకమా స్టాకా?" అంటూ నారాయణ వైపు చూశాడు.

"టీ తాగుతారా సార్?".

"వద్దబ్బా యిప్పుడే తాగొచ్చా"మళ్ళీ పుస్తకంలో చూస్తూ.

"పోనీ కూల్‌డ్రింక్?"

ఓసారి నారాయణను, నారాయణ నిలుచొన్న తీరుని చూసి "తర్వాత తాగుదాం" అంటూ గోదాము నాలుగు మూలల కలియ జూస్తున్నాడు. నారాయణ మూలకున్న వో ఫోల్డింగ్ చేర్‌ను దుమ్ము దులిపి వేశాడు. దాని మీద కూర్చుంటూ "కేసు రాయక తప్పదయ్యా బాబు" అన్నాడు. నారాయణ కాళీ డబ్బాను తెచ్చి ముందుంచగ దాని మీద డైరీని, ఫైల్స్‌ని పెట్టి తెల్ల కాగితాన్ని తీసి, సైడ్‌ను మలుస్తున్నప్పుడు బయట సైకిల్‌కు స్టాండ్ వేసి లోనికొచ్చాడు ఓ యువకుడు.

"మా పెద్దోడు ప్రసాద్, కాలేజి చదువుతున్నాడు." మన ఎ.సి.టి.వో. గారు.

"నమస్కారం సార్"

"నమస్కారం ఏం చదువుతున్నావ్ ?"

"బిం.కాం. సార్"

"గుడ్ వృత్తికి తగ్గ చదువు" అంటూ కనుబొమ్మలను కదిలిస్తూ నారాయణ వైపు చూశాడు.

నారాయణ ముఖంలో కొంచెం నవ్వు పొడ కదిలింది.

"తమరికెందరు సార్ పిల్లలు?" నారాయణ సంభాషణను పొడిగిస్తూ.

"ఓ అమ్మాయి యిద్దరబ్బాయిలు".

"జమ రెండైతే, ఖర్చు ఒకటి, అదృష్టవంతులు".

"ఏం జమో! ఏం ఖర్చో! ఏదీ మన చేతిలో లేదు!"

"అవును అంతా వాని దయ"

నారాయణ జేబులో చేయిపెట్టి -

"మీది మీకు!....." అంటూ ఆఫీసర్ కళ్ళలోకి చూశాడు.

ఆఫీసర్ మౌనంగా నారాయణ వైపు చూశాడు.

ప్రసాద్ యిద్దరి వైపు చూశాడు.

నారాయణ జేబులోని నోట్లు ఆఫీసర్ జేబులోకి వెళ్ళినా ఆయన చూపుల్లో మార్పు కనిపించదు.

"కేసు తప్పదు".

"ముడుపు చెల్లించినా కేసా?" అన్నట్టు చూసాడు నారాయణ.

"ఈ రోజు ఓ రెండు కేసులు బుక్ చెయ్యమని మా పై అధికారి ఆర్డర్" రాసిన కాగితాలను పిన్‌చేస్తు.

"నాబోటి చిల్లర కొట్టోడే దొరికిండా సార్? మీకు వూళ్ళో యింకా ఎంతో".

"చూడు నారాయణగారూ, దొరికింది పరక అయినా చేపను పట్టానుగదా అనుకుంటాడు చేపలు పట్టేవాడు".

నారాయణకు చెమటలు పోస్తున్నాయి.

ప్రసాద్ గోడకు ఆనుకొని నిల్చొని అంతా గమనిస్తున్నాడు.

"నీవు మాత్రం చిన్నోనివా, ఓ దుకాణం, దానికో గోదాం. బిం.కాం. చదవుతున్న కొడుకు, రేపు ఎం.బి.ఎ. చేస్తాడుతో" మాటలు మార్చుతూ.

"ఏం చదువుతాడో మొన్న ఓ సబ్జక్స తప్పాడు".

"అరె అలాగ !"

"వాండెం తప్పులేదు సార్, దిక్కు మాలిన నాదే తప్పు సార్. అక్కడ కాలేజి చదవాలి, ఇక్కడ వ్యాపారంలో సహాయం చెయ్యాలి".

"చదువుకునే కుర్రాళ్ళకి వేరే పని చెప్పొద్దు".

"మేం చెపుతాం సార్, వాల్ళంతట వాళ్ళే వచ్చి అదో యిదో చేస్తుంటారు".

"అలా కూడ చెయ్యనియ్యొద్దు. అసలు వీళ్ళను దూరంగా వుంచాలి. మా పెద్ద అబ్బాయి గూడ యింటర్ కాగానే శలవుల్లో బీబీనగర్ దగ్గర వున్న మా ఫ్యాక్టరీ దగ్గరికి వెడతానని, నా స్కూటర్ అడిగే వాడు. నేను వెళ్ళనియ్యక పొయ్యేది. డొనేషన్సు ముఖం చూడకుండా వాణ్ణి బెంగుళూరులో బి.టెక్.లో చేర్పించాను. ఆ తర్వాత రెండవ వాడు, హైదరాబాదులో మాదో చిట్‌ఫండ్ కంపెనీ వుంది. అక్కడికెళ్ళి కూర్చునేది. మన చిట్‌ఫండ్ అలా నడుస్తుంది, యిలా నడుస్తోందని యింటి దగ్గర తల్లితో చెప్పేవాడట. అది తెల్సి వాన్ని గూడ యిక్కడ వుండకుండా మద్రాసులో ఎం.బి..బి.ఎస్.లో మొన్ననే చేరిపించా. ఏదో దేవుని దయవల్ల యిద్దరు పెద్ద చదవుల్లో చేరిపోయారు. పోతే, అమ్మాయి ఎస్.ఎస్.సి. చదువుతుంది. అది మాతోనే వుందనుకో!"

"ఆడపిల్లలు ఫర్వాలేదులెండి. చదివించే వరకు చదువుకుంటారు".

"ఆ తర్వాత ఓ మంచి సంబంధం చూసి బంజారా హిల్స్‌లో ఓ యిల్లుంది, దాన్ని కట్నం కింద యిచ్చేస్తే ఫినిష్. మన బాధ్యతలు తీరినట్లే. అంతా వాని చలువే".

"బాధ్యతలు ఓనాడు తీరుతాయా సార్, చచ్చిందాక వుంటాయ్." అంటూ ఎసిటివో కళ్ళలోకి చూశాడు.

"ఏదో మనిషై పుట్టినందుకు మన పనులు మనం చేసకుంటూ పోవాలి. మిగతాది ఆపై వాని యిష్టం".

"ఓ యిద్దర్ని పిలుస్తావా ! పంచనామా రాస్తాను".

"ఏం రాస్తారుసార్? యింత చెప్పినా మీరు మళ్ళీ మొదటికొచ్చారు."

"అంటే కేసు రాయనని చెప్పనా ?"

"మీరట్లంటే మేం ఎట్లా బతుకుతాం సార్. ఓ బిల్ అటు యిటు. మీ కంటే మీ తాత, తండ్రీ సంపాదించి మీకిచ్చారు దాన్ని మీరు.."

"ఏంటి తాత... తండ్రి సంపాయించి యిచ్చారా ?అబ్బే అదేం లేదు. మా నాయనగారు నా చిన్నప్పుడే పోయారు. వీటన్నిటిని నేను నా స్వయంగా సంపాదించుకున్నా. నా యిరవై ఏండ్ల సర్వీసులో ఎంతో కష్టపడ్డా. ఆపైన ఆదేవుని దయ".

నారాయణకు ఓ మాదిరి నవ్వొచ్చింది. కాని దాన్ని లోలోపలనే అణుచుకున్నాడు. అంతలోనే ఓ పంది కొక్కు కొబ్బరి ముక్కను నోట కర్చుకొని, ఓ మూల నుండి మరో మూలకు పరుగెత్తింది.

"అయినా మీరు అంశమంతులు సార్ !
కష్టపడితే మాత్రం శ్రీమంతులవుతారా ?
కష్టపడుతూనే పస్తుండే వాళ్ళెంత మంది ?"

వాచ్ చూసుకొని "చాలా టైమైంది పిలు, పిలు. పంచనామా పూర్తి చేయాలి".

"వొద్దు సార్ యీ సారికి వొదిలే యండి. యికనుండి కరక్టుగా వుండేటట్టు చూస్తాను".

"కేసు కావాలని చెప్పానుగా?' అంటూ వ్రాస్తూ పోతున్నాడు.

"సార్ సార్ " అంటూ నారాయణ ఆఫీసర్ చేతులు పట్టుకోబోగ-

"చెప్పేది వినవయ్యా, ఏం కాదు. ఫైన్ పడతది" అంటూనే రాస్తూనేవున్నాడు.

పక్కనే నిలుచోని చూస్తున్న ప్రసాద్ ఓపికను కోల్పోయి-

"నాన్నా, రాసుకోనీ - మనం వో దొంగ తనం చెయ్యలేదు, టాక్స్ ఎగ్గొట్ట లేదు. పావలా వీళ్ళకిచ్చి ముప్పావలాను మిగిలించుకోలేదు. ఏదో పొరపాటైంది. అంతే -"

"ఎగ్గొట్టే ఉపాయంతోటే అలా చేస్తారు".

" మేము అలా ఎగ్గొట్టి ప్రభుత్వాన్ని మోసం చేస్తే

ఈపాటికి మాకు బంగళాలుండేవి, ఫ్యాక్టరీలుండేవి, చిట్‌ఫండ్ కంపెనీలుండేవి ! మేము పెద్ద పెద్ద డొనేషన్స్ కట్టి పెద్ద చదువులే చదివే వాళ్ళం ! తరతరాల నుండి ఈ బేరం ఎందుకు చేస్తూ వుండేవాళ్ళం ? మేమూ ఎంతో సంపాయించే వాళ్లం. గోదాముల్లో సరుకులను బ్యాంకుల్లో కుదువ వుంచే వాళ్ళమా ? అందుకే కేసు రాయండి''.

రాయడం ఆపి ప్రసాద్ వైపు చూస్తున్న ఎ.సి.టి.వో. గారి గొంతులో తడారింది మెల్లగా జేబులో చెయ్యి పెట్టి యింతకు ముందు నారాయణ యిచ్చిన నోట్లను తీసి తన ముందున్న డబ్బా మీద పెట్టాడు.

ప్రసాద్ మాట్లాడుతూనే వున్నాడు.

"కోర్టు కెక్కించండి. అన్నీ మేము అక్కడే చెపుతాం. అసలు ఎవరు టాక్సీ ఎగ్గొడుతున్నారు? ఎలా ఎగ్గొడుతున్నారు ? అలా ఎగ్గొట్టమని దారులు చూపించి దానిని చట్టం దృష్టి నుంచి తప్పించి, వాటాలుగా పంచుకొని, ఆడంబరమైన జీవితాలను ఎవరు గడుపుతున్నారో! ఎవరు ఆస్తులు సంపాదించుకుంటున్నారో? అన్నీ ఎంక్వైరీ కావాలి. మనుషులను మోసం చేసి సంపాదిస్తూ దేవుని దయంటూ బుకాయిస్తున్న దెవరో'' ప్రసాద్ యింకా మాట్లాడుతూనే

పున్నాడు.

ఎసిటివో గారి వళ్ళంతా చెమట పట్టింది. "రేపు ఆఫీసుకురండి" అంటూ మెల్లగా లేచి కాగితాలను చంకన పెట్టుకొని, దస్తీతో నుదురును తుడుచుకుంటూ బయటికి నడిచాడు.

నారాయణ నోరు విప్పలేక నిలుచుండిపోయాడు.

ప్రసాద్ చూపులు ఎసిటివోనే వెంటాడుతున్నాయి.

1993

# రంగులు

అది విశాలమైన పోలీసు పరేడు గ్రౌండు. పదిహేనోవ ఆగస్టు జండా వందనం జరిగిన తర్వాత, రంగు, రంగుల కాగితాలతో చుట్టూరా అలంకరించిన వేదిక మీద జిల్లా కలెక్టర్, ఆజిల్లాను పర్యవేక్షించే మంత్రిగారు కూర్చొగ అదే స్టేజికి ఒక వైపు ఆడవాళ్లు, మరోవైపు మగవాళ్లు కూర్చున్నారు.

వాళ్లముందు వరసలో చెరువు కట్టమీద వాలిన కొంగల్లా తెల్లని ఖద్దరు ధరించిన కొందరు, పసుపు రంగు చొక్కాలు ధరించి పొద్దుతిరుగుడు పూవుల్లా మరికొందరు, చోటబడా నాయకులు కూర్చున్నారు.

గ్రౌండ్ చుట్టూరా బాలబాలికలు నిలుచున్నారు. గ్రౌండులోపల పోలీసువాళ్ళు వరుసలొరుసలుగా విశ్రం పొజిషన్‌లో నిలుచున్నారు.

మైకు దగ్గర ఆ రోజు తామ్ర పతకాలు తీసుకోబోయే స్వాతంత్ర్యం సమరయోధుల పేర్లను పిలుస్తువుంటే ఒక్కొక్కరే వచ్చి మంత్రిగారి నుండి తామ్ర పత్రాలను తీసుకుంటున్నారు. స్వాతంత్ర్యం తెచ్చిన డెబ్బై ఏళ్లవాళ్లు దానిని నడుపుతున్న ముప్పై ఐదేళ్ల మంత్రిగారు కరచాలనం చేసుకుంటున్నారు.

మధ్యమధ్యన జనం చప్పట్లు, వయోవృద్ధులైన స్వాతంత్ర్య సమరయోధులు తమ, తమ గతాన్ని నెమరేసుకుంటు నడుస్తున్నారు. తల్లుల దగ్గర నిలుచున్న లోయర్ కే.జీ, అప్పర్ కేజీ, పిల్లలు మమ్మి" వీళ్లు ఏ గేమ్‌లో విన్ అయ్యారు" అని ఆశ్చర్యంగ అడుగుతున్నారు.

"జెండా చంద్రయ్యా" అధికారి పిలుపు.

ఎవర్రూ రాలేదు.

చుట్టూ చూసి మళ్లీ పిలిచాడు.

అందరి చూపులు గ్రౌండ్ చుట్టువున్న జనాల్లో జెండా చంద్రయ్య ఎవరా అని వెదుకుతున్నాయి.

అధికారి చంద్రయ్యను గూర్చిన పరిచయవాక్యాలు చెపుతూనే పోతున్నాడు.

"బ్రిటీష్ వాళ్లు నిషేదించిన ప్రాంతాలలో మనజెండా నాటుతున్నప్పుడు, శత్రువుల తుపాకీ గుండు భుజంలోంచి దూసుకుపోయింది. ప్రాణాన్ని లెక్క చేయకుండా జెండా ఎగురేసి మరఫిరంగులను తప్పించుకొని మాతృభూమి పరిరక్షణకై ప్రాణాలను లెక్కచేయని స్వాతంత్ర్య సమరయోధుడు"

కొంతమంది ఖర్చీఫ్‌తో నుదురును అద్దుకున్నారు. మరికొంతమంది కళ్లద్దాలు సరిచేసుకున్నారు. చాలామంది ఆడవాళ్లు బరువైన శ్వాసను వొదులుతూ తమను తాము మర్చిపోయి వినయ మనస్సులతో చంద్రయ్య వేసే అతికష్టమైన అడుగులను చూస్తున్నారు.

జనంలోంచి ఓ ఎముకలగూడు కదిలొస్తుంది. అందరి చూపులు ఒక్కసారే అటు మళ్లినవి. ఊపిరి బిగపట్టి చూస్తున్నారు.

వయస్సు మళ్ళి జవసత్వాలుడిగి, చేతికర్ర సహాయంతో వస్తున్న ఆయనకు కుడి చెయ్యిలేనట్లు చినిగిన గుడ్డ పేలికల్లోంచి స్పష్టంగా కనిపిస్తుంది. పాదాలకు సగం అరిగిన రబ్బరు చెప్పులు, తైల సంస్కారం లేని జుత్తు, తెల్లగా నెరసి పెరిగిన గడ్డం. రక్తప్రసారం సరిగ్గా లేక కాబోలు సోడా సీసాల్లోని సీసపు గోళీలాగ సత్తువను,

జీవకళను కోల్పోయిన కనుగుడ్లు. జీవితంలోని లోతుపాతులను, కష్టసుఖాలను జీర్ణం చేసుకొని, ముడతపడ్డ ముఖం. వెన్నంటిన డొక్కలో ఏ ఆసరాలేదని చూస్తేనే తెలుస్తుంది.

"వీరి ధైర్య సాహసాలకు, త్యాగబుద్ధికి మెచ్చుకొని మన ప్రభుత్వం తామ్రపత్ర బహూకరణను ప్రకటించింది." అన్న పరిచయ వాక్యాలు విన్న మంత్రిగారు కదిలి కూర్చుంటు నుదుటి మీద చెమటను ఖర్చీఫ్‌తో అద్దుకున్నాడు.

రోజూ చద్దన్నంకోసం యిల్లిల్లు తిరిగే ఈయన స్వతంత్ర్య సమరయోధుడా? అంటూ ఆడవాళ్ల గుంపులో గుసగుసలు.

బస్టాండ్ దగ్గర అడుక్కుంటు తిరిగే ఈ అవిటివాడు తెల్లదొరల నెదిరించి జెండా నాటాడులే...ఒఖ్! అంటూ మగవాళ్ళు, బడిపిల్లలు మాత్రం చరిత్ర పుస్తకంలో లేని పాఠం గదూ అని ఆసక్తితో వింటూ రెప్పవాల్చకుండా చూస్తున్నారు.

చంద్రయ్య కళ్లల్లో గతం కదలాడింది. పాతికేళ్లప్పుడు వూరొదలి తల్లి దండ్రుల మాటకాదని పెళ్లిగూడ చేసుకోక,

మంత్రిగారిముఖం వైపు తామ్రపత్రం వైపు చూపులను మార్చి మార్చి చూస్తున్నాడు చంద్రయ్య.

జనం చప్పట్లు కొట్టారు. కడుపులో ఆకలి ఒక్కసారే పేగును మెలిపేసింది. అడుగుతీసి అడుగు వేయటం కష్టమైపోయింది. ఆరోజుల్లో అసలే గుర్తురాని ఆకలి యిప్పుడు అడుగడుగున కుంగదీస్తుంది. యిక తనువు చాలిస్తే బాగుండు. అనుకుంటూ యింకా చప్పట్లు కొడుతున్న బాలబాలికలవైపు చూశాడు.

ఏదోకొత్త ఆశ అతని కళ్లల్లో మెరిసింది. "వీళ్లైనా రేపు ఈ దేశాన్ని బాగుచేసుకొంటారో" అనుకుంటు వెనక్కు మళ్ళి పిల్లలు నిలుచున్న వైపు నడిచాడు.

## PUBLISHER'S NOTE

### మా కథ

పదిహేను ఏళ్ళ క్రితం నల్లగొండ లో ఏకాభిప్రాయంగ కొందరం కలిసి "సాహితీ మిత్రులు, నల్లగొండ" అనే సంస్థను స్థాపించాం. సాహితీ సమావేశాలను నిర్వహించడం, సాహితీ మిత్రుల రచనలను, కథలను సంకలనాలుగా ప్రచురించడం, మా సంస్థ యొక్క ఉద్దేశ్యాలు.

### మా ప్రచురణల కథ

1970 ఆ ప్రాంతంలో మొదట "దర్పణం" త్రైమాసిక పత్రికను వెలువరించాము దానికి శ్రీ కాంచనపల్లి చిన వెంకట రామారావు గారు సంపాదకులు. ఆరోజుల్లో పత్రిక చాలామందిని ఆకర్షించింది. సంచలనన్ని సృష్టించింది

1980 "గొర్రెలు" కథా నంకలనన్ని ప్రచురించాం. ఆ పుస్తకానికి ఆ పేరు బాగా కుదిరిందని తర్వాతతర్వాత గాని తెలియలేదు. అంతే కాకుండా సుప్రసిద్ధ రచయిత శ్రీ రాచకొండ విశ్వనాథ శాస్త్రి గారు దీనికి పరిచయ వాక్యాలు వ్రాయడం ఓ విశేషం. ఈ పుస్తకం కౌలాలంపూర్‌లో జరిగిన రెండవ ప్రపంచ తెలుగు మహాసభ నుండి విడుదల చేయబడటం అక్కడి తెలుగు సోదరుల మన్ననను పొందటం అనుకోకుండా లభించిన ఓ మంచి అవకాశం. ఆ తర్వాత 1983 "ఎచ్చరిక" కథలను ప్రచురించాం.

ఆంధ్ర దేశంలోని ప్రముఖ పత్రికలు, పాఠకుల ముందుంచిన కొన్ని సమీక్షలను మీ ముందుంచుతున్నాం.

"కథలు ఆకాశంలో పుట్టవు మనిషి జీవితంలోంచి పుడతాయి. అందుచేతనే రచయిత జీవితానికి దగ్గరగా వుండాలి. జీవితానికి దగ్గరగా వుండదగిన వారే మంచి రచయితలుగా మిగులుతారు" రా.వి. శాస్త్రి గారి ఈ మాటలకు జంగయ్యగారి ప్రతి కథా మంచి ఉదాహరణ.

ఆంధ్రపత్రిక — టి. ఎల్. కాంతారావు.

"ఈనాటి వాస్తవికతకు ముఖ్యంగా తెలంగాణా గ్రామాల్లో జరుగుతున్న ఘోరాలకు ఈ కథా సంకలనం ప్రతిబింబం. అభూత అసందర్భ కల్పనల్లోంచి, అవాస్తవిక ప్రపంచంలోంచి, దెయ్యాల, భూతాల క్షుద్ర సాహిత్యం తెలుగు రచన బయటపడి పునర్జీవించడానికి ఇలాంటి సంకలనాలు ఎన్నైనా రావాలి.

భారతి, మాసపత్రిక

"జీవితాన్ని బాగా చదివినవారే ఇటువంటి ఉత్తమ కథలు రాయగలరు. వీటిని చదువుతున్నప్పుడు వొళ్ళు జలదరిస్తుంది."

రా.వి.శాస్త్రి.

"గొర్రెలు సంపుటితో తెలంగాణా పీడిత తాడిత జనాన్ని పరిచయం చేసిన బోయ జంగయ్య "ఎచ్చరిక" మరొక సంపుటాన్ని పాఠకులకు అందచేశారు. బోయ జంగయ్య ఒక సంపుటికి మరొక సంపుటికి పెరుగుతూ ఉన్న రచయితలా ప్రత్యక్షమవుతాడు. ఇతని క్రాన్ ఉపమానాలు ఈయన కథ వస్తువుకు పదును పెట్టేవిగా ఉంటాయి. ఒక అవినీతి గూర్చి చెబుతూ మరొక వ్యవస్థలోని దానితో పోల్చి, చివరకు బస్ సర్వీస్ దాక పోయి మొత్తం గంపంతా కుళ్ళిన సరుకేనని తేల్చివేస్తాడు. బాధితుల దురవస్థను దీనంగా, జాలిగొలిపే

విధంగా చిత్రించి అంతటితో వదిలివేయడు. వాళ్ళకు కనువిప్పు కలుగుతోందని, వాళ్ళలోంచి సూర్యుళ్ళు పుట్టుకొస్తున్నారని, వాళ్ళ బ్రతుకుల్లో పొద్దు పొడవనున్నదని నేటి సమాజాన్ని తగు మాత్రం ఎచ్చరించడం ఈ సంపుటిలోని ప్రత్యేకత''.

ఆంధ్రప్రభ - డి. రామలింగం

'' కథల్లో జీవిత చిత్రణ ఉంది ఓ లక్ష్యం, ఓ సూత్రం రన్నవుతుంది. ఈ వ్యవస్థలో ఎవరైతే బాధపడుతున్నారో వాళ్ళ బాధల్ని యాక్చువ్గ రశారు అని రా.వి శాస్త్రి గారి సర్టిఫికేట్ అందుకున్న బోయ జంగయ్య గారి ఐదు కథల సంపుటిని ప్రచురించిన సాహితీ మిత్రులు అభినందనీయులు''.

ఈనాడు దినపత్రిక

మీరురాసిన ''ఎచ్చరిక'' చూచాను. గ్రామీణ జీవితంలో సంఘటనలు ఆనాటి పోరాటాలు గడిచిపోగా, ఈనాడు సమాజంలో చిన్న చిన్న వర్గాలు అనుభవిస్తున్న అవస్థలు సామాజిక పరివర్తనలో అనుదినం అనుభవిస్తున్న కష్టాలు కళ్ళకు కట్టినట్లుగా చూడగలిగాను. చదివాను.

28-8-85 అభినందనలతో

సత్తెనపల్లి -వావిలాల గోపాల కృష్ణయ్య

ఈ ఎచ్చరిక కథకు 1984 లో శ్రీ శ్రీ స్మారక బంగారు పతకాన్ని నాగార్జున విశ్వ విద్యాలయం వాళ్ళు బహూకరించారు. అప్పటి నుండీ మా కథలు బంగారు కథలయ్యాయి. ఆ తర్వాత 1985 లో వెలుతురు కవితా సంకలనాన్ని ప్రచురించాం. కవితా సంకలనం గూడా ఎంతో ప్రశంశలను అందుకుంది.

''జూన 1976లో నల్లగొండ సాహితీ మిత్రులు బోయ

జంగయ్య కవితా సంకలనం, నడుస్తున్న చరిత్ర, ప్రకటించారు అప్పుడే నడుస్తున్న చరిత్రను సాంతం చదివి సంతోషించాను. నడుస్తున్న చరిత్రలోని ఖండికలు పద్దెనిమిది, పుటలు ఇర్వై, ఆనాడే అన్నాను వ్యాసుని నాటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలు, నేటి మహాకావ్యం పద్దెనిమిది పుటలు అన్న శ్రీ శ్రీ మాటకు 'నడుస్తున్న చరిత్ర' జంగయ్య కవితా సంపుటి నిదర్శనమని, నాకట్లా అనిపించింది

ఈనాడు "వెలుతురు" చిందిస్తూ జంగయ్య మరో కవితా సంకలనం మన ముందుకు వస్తున్నది. వెలుతురు జాడగని నా గొడవ కొక్కొరకో అంటున్నది.

హనుమకొండ — కాళోజి

ఇన్నాళ్ళుగా కథలు నడిపిన జంగయ్య ఇప్పటికి కవితా సంపుటి తీసుకొస్తున్నాడు. ఈ సంపుటిలో వున్న చాల కవితలు ప్రత్యక్షంగా చూసిన సత్యానికి కట్టిన చిత్రాలు.

కథా రచనలో జంగయ్యకు బలమైన గొంతు ఏర్పడింది కవితల్లో కదిలించే గుండె కదను తొక్కింది. పలుకూ పదునూ కాపాడుకుంటూ జంగయ్య మరిన్ని చక్కని కవితలు వ్రాయాలని కోరిక. బోయ జంగయ్య 'వెలుతురు' కు ఇదే నా ప్రసరణ.

19-2-86 సి. నారాయణ రెడ్డి
హైదరాబాదు వైస్ ఛాన్సలర్, సార్వత్రిక విశ్వవిద్యాలయం

తర్వాత 1988లో "జాతర" నవలను ప్రచురిస్తే, దానిని మైసూరు విశ్వవిద్యాలయం వాళ్ళు బి.ఎ. ఇడి. కి ఉపవాచకంగా ఎంపిక చేశారు. అంతే కాదు తెలుగు విశ్వవిద్యాలయం వారు 1989 సం॥పు ఉత్తమ నవల అవార్డును గూడ బహూకరించారు. దానికి ముందు మాట రాస్తూ -

"జీవితం గురించి బాగా తెలిసి రాసే [illegible]
బోయ జంగయ్య గారు ఒకరు. ఆయన [illegible]
'జాతర' నవల ఆయన ప్రతిభకు ఒక మచ్చు తునక.

ఈ నవల గ్రామీణ జీవితానికి అద్దం పడుతుంది [illegible]
పూజీరి వర్గం దోపిడికి గురవుతున్నారో [illegible]
ఇందులో సిద్ధాంతాలు, స్లోగన్లు, చర్చలు వాదోపవాదాలు [illegible]
కథ ప్రవాహ సదృశంగా సాగిపోతూ జీవిత [illegible]
మూఢ నమ్మకాలను పటాపంచలు చేస్తుంది [illegible]
ప్రయోజనం ఏమికావాలి? రచయిత స్థిత ప్రజ్ఞుడు [illegible]
ఎవర్నీ తిట్టడు, ఉన్నది వున్నట్టు చెప్తాడు. పీడిత [illegible]
మన సమాజం ఇటువంటి దురన్యాయాల [illegible]
నుంచి బయటపడాలి. ఈ సందేశం కూడా [illegible]
కలుగుతుంది. కాని ఇలా చెయ్యమని [illegible]
బయిటికొచ్చి గోలపెట్టడు జంగయ్యగారు. [illegible]

– [illegible]

## విశిష్ట రచన

కొన్ని మంచి పుస్తకాలను చదువుతున్నప్పుడు [illegible]
వెంట పరుగెడుతున్నాయని, పేజీలు తిప్పుతున్నామని [illegible]
స్ఫురించదు. సాక్షాత్తుగా యథార్థ జీవిత దృశ్యాలను [illegible]
ఉంటుంది. 'జాతర' నవల అలాంటిదే. రచయిత [illegible]
నల్లగొండ జిల్లాలోని గ్రామీణ ప్రాంతం ఇతర ప్రాంతాల [illegible]
గది లాంటి ఆ ప్రాంతంలో 'స్కాన్' చేయగలిగే [illegible]
'జాతర' నవల వెలువడింది. అక్కడి ప్రజా జీవితం [illegible]
చెడ్డలతో నిమ్నోన్నతాలతో, మేలు కోళ్ళతో దృశ్యమానమై [illegible]
మంచి సాహిత్యానికి ఇంతకంటే కావలసిందేముంది?

అటు సామాజిక విషయపరిజ్ఞానమూ ఇటు శిల్ప మర్మజ్ఞత సమపాళ్ళలో మేళవించిన విశిష్ట రచన - 'జాతర'

- మధురాంతకం రాజారాం

జాతర సజీవ రచన. వాస్తవిక చిత్రణ జీవిత అనుభవం పండిన భావాలు. మర్మస్పృక్కులైన మాటలు. జాతర నాకు నచ్చింది.

జులై 1990

హైద్రాబాద్ ఆచార్య బి. రామరాజు

"జానపదుల అసలైన సిసలైన హృదయం తెలిసిన రచయిత శ్రీ బోయ జంగయ్య, వారి ప్రతి రచన జానపదుల హృదయాలకు నిలిపిన నిలువుటద్దం.

సెప్టెంబర్ 1988 తూమాటి దోణప్ప

హైద్రాబాద్ వైస్ ఛాన్సలర్, తె.వి.వి

ఈ నవలలో నల్గొండ జిల్లా పల్లె వాతావరణాన్ని సహజ సుందరంగా వెల్లడించిన "జాతర". ఈ నవలలో పాత్రచేత నల్లగొండ జిల్లా ప్రవాస భాషను వాడడం సముచితంగా ఉంది రచయిత వ్యాఖ్యానాలకు శిష్ట వ్యవహారికాన్ని వాడారు. దీని వల్ల నవలకు చివరంటూ చదివించే గుణం అలవడింది. అంతే కాకుండా శిల్ప నైపుణ్యం పాఠకులను చకితులను చేస్తుంది.

ఉదయం - కాసుల ప్రతాపరెడ్డి

ఆ తరువాత 1990 లో 'దున్న' కథలను ప్రచురించినాము. దానిని మద్రాస్‌లో జరిగిన 'కథా వేదిక' సదస్సులో ఆవిష్కరించాము. ఆ కథల గూర్చి -

1990 ఆగస్టులో మొదటి ముద్రణ, అక్టోబరులో రెండవ ముద్రణ పొందిన ఈ కథా సంపుటికి పరిచయ వాక్యాలు రాస్తూ, 'తెలంగాణా గ్రామీణ వ్యవస్థ, సమస్తమైన దాని లక్షణాలతో అందులో జీవించే దున్నలతో, గొర్రెలతో, నక్కలతో, ఈయన కథలు దర్శనమిస్తాయి. - అన్నారు ప్రముఖ రచయిత డి. రామలింగం.

సీతాకోక చిలుక మందారపు పూరేకుల్లో యిమిడిపోవటం, మాట్లాడితే పూలు చల్లినట్లు వుండడం, దగ్గర అవుతున్న నగరం అరణ్యంలా కనిపించడం, చూపులు మత్తెక్కించే మంత్రాలు, మనుషుల కంటే పక్షులే నయం, సూద్దాం అనకుండ్రి - సేస్తం అనండ్రి. ఊరు నిద్రలేస్తున్న చప్పుడు, - యిటువంటి ప్రయోగాలు కథకునిలోని కవితాత్మకు సూచకాలు.

కథని అల్లడంలో నేర్పు, చెప్పడంలో చాతుర్యం, చదివించడంలో కౌశలం, యితివృత్తంలో నవ్యత, చిత్రణలో రసస్ఫూర్తి గల ఉత్తమ కథా రచయిత బోయ జంగయ్య.

జగతి                                                  - దయానిధి
ఆగస్టు '91

సాహితీ మిత్రులు
నల్లగొండ.

---

"ఎచ్చరిక" కథలు : 15/-
"వెలుతురు" కవితలు : 15/-
"జాతర" నవల : 15/-
"దున్న" కథలు : 15/-
"డా|| బి.ఆర్. అంబేద్కర్" : 15/-

ప్రతులకు -
బి. చేతన్, H. No. 5-9-14 మాన్యంచెలుక,
నల్లగొండ - 508 001 : ఫోన్ 2515 మరియు
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, హైద్రాబాద్ - 1

చేనుకుంటే తాను కుటుంబ జీవితానికే పరిమితమైపోతానేమోనన్న భయంతో రాత్రింబవళ్లు తిండి నిద్ర ఎరుగక దేశమంతా తిరిగిన రోజులు దేశ స్వాతంత్ర్యం కోసం తిన్నలాఠీదెబ్బలు ఒక్కొక్కటీ గుర్తొస్తున్నాయి.

స్వరాజ్యం రావాలని దేశమంతా ఒక్కటై తెల్లోని పాలనకు వ్యతిరేకంగా పోరాడిన రోజులు కళ్లముందు నిల్చినవి. సత్యాగ్రహాలు, సహాయనిరాకరణ, విదేశీ వస్త్ర బహిష్కరణ, ఉద్యమ నాయకులు జైళ్లల్లో ప్రతివానిలో ఓ ఉత్తేజం పొటమరిచింది.

తెలంగాణాలో నిజామ్ రాచరికానికి వ్యతిరేకంగా సామాన్యుడు ఎదురుతిరిగి తుపాకి పట్టాడు. ఆడవాళ్ళు నడుంకట్టి ముందుకొచ్చిపోరాటానికి, ఊపిరి పోశారు. నవాబుల తాబేదార్లు అయినా దొరల, భూస్వాములను మట్టికరిపించారు. ఏదోకొత్తసత్తువ అతనిలో నిండుకొంది. ఓ హుందాతనం చోటు చేసుకోగా నడకలో వేగం పెరిగింది. ఆనాడు తన భుజంలో తుపాకి గుండు దూసుకు పోయినప్పుడు లెక్కచేయకుండా నడిచిన నడక, చేతిలో రెపరెపలాడే జండా, ఎన్ని మరఫిరంగుల ధ్వనులు!

ఈ లోపున స్టేజీ దగ్గరికి చేరేసరికి అతని మనస్సు

తన ఊరువెళ్లింది.

'తన వూళ్లోని తన యిల్లును రజాకిర్లు తగుల బెట్టిరి. తన గూర్చిన ఆ చూకి చెప్పనందున తనతండ్రిని కాల్చిచంపిరి. తనరాకకోసం ఎదురుచూసి, చూసి తన తల్లి కళ్లు మూసె. అయినా తనకు ఒక్క ఊరేమిటి ఈ దేశమే ఓ ఊరు" అనుకుంటు నడుస్తున్న చంద్రయ్యా ఆగి ఓసారి వేదికమీద కూర్చున్న వాళ్లను చూశాడు.

వర్తమానం వరదలా వచ్చి తనను ఉక్కిరిబిక్కిరి చేసింది. తెల్లోనిపాలన కన్న నల్లోల్లపాలన ఏం మెరుగ్గా లేదు. ఆదోపిడి మోసం, అందుబాటులోలేని ధరలు, ధగాకోరు ఎన్నికలు, అమ్ముడు పోయే ఓట్లు, పదిమందికో పార్టీ. కాదంటే కత్తిపోట్లు. కుల అహంకారపు దౌర్జన్యాలు, పాడిపరిటలు తరిగి పల్లెలు పాడైపోతుంటే నకిలీ సరుకులతో పట్టణాలు బల్సిపోతున్నై. మత తగాదాలతో మారణహోమం సృష్టించుకుంటున్నారు. అబ్బా ఏం బతుకులో అనుకుంటు చుట్టూ చూశాడు.

తోటలో పూసిన రంగురంగుల పూలలా చుట్టూర బాల బాలికలు.

ఎదురుగ స్టేజిమీద చేతిలో తామ్రపత్రంతో మంత్రిగారు.